శ్రీ రస్తు




# విజయవిలాసము

చేమకూర. వేంకటకవి ప్రణీతము.

0—12—0



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులుఅండ్ సన్సు వారిచే

ప్రకటితము.

1920.

*All Rights Reserved.*

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




సుభద్రాపరిణయ మనునామాంతరము గల యీవిజయవిలాస
ం చేమకూర - వేంకటకవి రచించెను. ఇయ్యది తంజావూరునకుఁ
ి వగురఘునాథరాజున కంకిత మొనర్పఁబడియున్నది. ఈరఘునాథ
క్రీ. శ. 17 వశతాబ్దారంభమున రాజ్యము చేసినట్లు కానవచ్చుచు
. కావున నీకవియును ఆకాలముననే యుండె ననుట స్పష్టము.
యవిలాసము వ్రాయుటకుఁ బూర్వము వేంకటకవి సారంగధరచరి
మనునొకపద్యకావ్యమును రచించి యీకృతిపతికే యంకితముఁ
యుండెను.

చేమకూర - వేంకటకవి ఆంధ్రనియోగిబ్రాహ్మణవంశసంజనితుఁ
కొందఱును, భోగినీకులసంజాతుఁ డని మఱికొందఱును భిన్నాభి
ములై యున్నారు. ఎట్టికులమునఁ బుట్టినను, ఈసరసకవి తనకవితా
మచేఁ దనకులమునకు వన్నెయును వాసియునుఁ దెచ్చియుండె
కు సందేహము లేదు. విజయవిలాసము తెలుఁగునఁ గలయత్యు
ప్రౌఢకావ్యములలో నొకటి యని సకలపండితజనంబులచే నేకగ్రీ
గాఁ గొనియాడఁబడుచున్నది. ఈసుకుమారకావ్యము వ్యంగ్యప్ర
మై, ప్రతిపద్యరసాస్పద మై ఉచితశబ్దార్థాలంకారశోభిత మై
ారివీనుల నమృతంపుసోన లొలుకుసరసవచోరచనల నలరారు
ది.

ఇందలియితివృత్తము శ్రీమహాభారతమునుండి గ్రహింపఁబడి
అర్జునుఁడు బ్రాహ్మణగోసంరక్షణార్థ మై విలు నమ్ములు గొన ధర్మ
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
నంతఃపురంబుఁ జొచ్చి సమయభంగంబుఁ గావించుటయుఁ, దన్ని

వారణార్థ మై భూప్రదక్షిణ మొనర్ప నగ్రజుననుజ్ఞఁ గొని బయ
టయు, మార్గమధ్యంబున నలూపి యనునాగకన్యకచే వరిం
యు, నటమీఁదఁ బాండ్యదేశాధీశుం డగుమలయధ్వజమహ
సంమానితుం డై తదీయనందన యగుచిత్రాంగదను వివాహ
యు, నచ్చటనుండి శ్రీకృష్ణునిచెల్లె లగుసుభద్రను వివాహమాడ
న యతివేషముతో ద్వారకాపురంబుఁ జేరుటయుఁ, గృష్ణానుమతి
వసుదేవు లొసంగ బలరామునికిఁ దెలియకుండ సుభద్రను వి
ద్వారకాపురంబు వెడలి త్రోవ నడ్డగించుయాదవసైన్యంబుల
యింద్రప్రస్థంబుఁ జేరి సహోదరబంధుమిత్రసమాదరణముం
టయు, సుభద్రయందుఁ బుత్త్రరత్నం బగునభిమన్యుఁ గాం
మొదలుగాఁ గల విషయంబు లిం దతిమనోహరములుగ . న
బడి యున్నవి.

తండయార్పేట,
చెన్నపురి.

వావిళ్ల. వేంకటే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

C.M.



శ్రీ.

# విజయవిలాసము

## పీఠిక



తెల్లప్పు డొసఁగ నిసకలధాత్రీచక్రమున్ బాహుపీ
ఠీలగ్నంబుగఁ జేయ దిగ్విజయ మీఁ డీకొన్నచందాన నే
వేళన్ సీతయు లక్ష్మణుండుఁ దను సేవింపంగ విల్ పూని చె
ల్వాలీలన్ దగు రామమూర్తి రఘునాథాధీశ్వరుం బ్రోవుతన్. 1

కలకంఠకంఠియు ధరిత్రియు దక్షిణవామభాగముల్
కొని కొల్వ వారిఁ గడఁకన్ గడకన్నులకాంతిఁ దేల్చి తా
కమలాప్తతం గువలయాప్తతఁ దెల్పెడు రంగభర్త లో
కవిభుత్వ మిచ్చు దయ నచ్యుతు శ్రీరఘునాథశౌరికిన్. 2

రుచిరాంగి నిభసనసీమ ధుర్యసంబుగ నిల్చె నేలు దీ
రుణి నిప యన్నక్రియ దక్షిణపాణి నెఱుంగఁజేయుశ్రం
రరసాబ్ధి వేంకటనగస్థిరవాసుఁడు పూర్ణదృష్టి నెం
రఘునాథభూరమణదేవు గుణంబులప్రోవుఁ బ్రోవుతన్. 3

యుతుఁ డటంచు నలువ దీర్ఘాయు వొసఁగి
యు రఘునాథవిభు వజ్రకాయుఁ గాఁగ
వరుఁ డని హరుఁ డత్యుదారకరుణఁ
ము నెప్పుడు విజయు నజేయుఁ గాఁగ. 4

గుడుందమ్ముల విప్పునప్పుడు రజంబున్ జక్రవాళంపుఁగొం
డిన్ దేఱుగ డైనపట్లఁ దమమున్ మందేహులన్ దోలి వా
గడల్కాంతటియందు సత్త్వముఁ బ్రకాశింపన్ ద్రిమూర్త్యాత్మకుం
తేజోనిధి వేడ్కఁ జేయు రఘునాథాధీశుఁ దేజోనిధిన్. 5

ద్యద్దంతిముఖార్చనానియమమున్ బాటించు నెల్లప్పుడున్
ప్యపూర్ణఫలాప్తిచే మనుచు నంతర్వాణులన్ మామన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హృద్యుం డౌ రఘునాథశౌరి యని కూర్మి న్సాటికిన్ బోఁటికిన్
విద్యాబుద్ధు లొసంగి ప్రోతు రతనిన్ విఘ్నేశుఁడున్ వాణియున్.

శా. ప్రాగల్భ్యంబున విష్ణుశంభుమతముల్ పాటించి సర్వంసహా
భాగం బందు సమప్రధానగతి నొప్పన్ రాజలోకంబులోఁ
దా గణ్యుం డని యచ్యుతేంద్రరఘునాథక్షోణిభృన్మౌళికిన్
శ్రీగౌరుల్ సమకూర్తు రాహవజయశ్రీగౌరులన్ నిత్యమున్.

మ. ప్రకటశ్రీహరియంఘ్రిఁ బుట్టి హరుమూర్ధం బెక్కి యాపాదమ
స్తకమున్ వర్ణన కెక్కు దేవి సహజోదంచత్కులోత్పన్ననా
యకరత్నం బని యచ్యుతేంద్రరఘునాథాధీశ్వరస్వామికిన్
సకలైశ్వర్యములు న్నిజేశువలనన్ దాఁ గల్గఁగాఁ జేయుతన్.

క. ఆరాజశేఖరుఁడు ప్రియ, వారిజముఖి తోడుగాఁగ వర్ధిలఁ విమల
శ్రీరుచిరవంశమున ధా, త్రీరంజనసుకృతి చెవ్వనృపతి జనించెన్.

క. ఆచెవ్వనృపాలాగ్రణి, యాచంద్రార్కముగఁ గాంచి నరుణాచలవృ
ద్ధాచలములఁ గట్టించె మ, హాచతురసమీరగోపురావరణంబుల్.

తే. ఠీవి నచ్యుతరాయలదేవి యైన, తిరుమలాంబకు ననుజ యై తేజరిల్లు
మూర్తమాంబను బెండ్లియై కీర్తి వెలయఁ, జెవ్వవిభుఁడు మహోన్నతశ్రీము

క. ఆమూర్తమాంబ కఖిలమ, హీమండలనాథుఁ డచ్యుతేంద్రుఁడు సుగుణో
ద్దాముఁడు జన్మించెం ద, ద్భూమిపతి రంగధాముపూజ న్మించెన్.

శా. శ్రీరంగేశుఁడు వచ్చి యచ్యుతధరిత్రీభర్త యై భాగ్యరే
ఖారూఢిన్ విలసిల్లి తాను తనకున్ గైంకర్యముల్ చేసెఁగా
కేరా జైనను జేయఁగాఁ గలిగెనే యిట్లీవిమానం బహో
భూరిస్నిగ్ధముగా మహామణిమయంబుల్ గాఁ గిరీటాదులున్.

చ. గెలిచినగెల్పు లర్థితతికిన్ దిన మిచ్చినయీవులున్ సహుల్
తలఁచిన విక్రమార్కు లొకలక్షయుఁ గర్ణులు కోటియున్ గదా
కలిగిన నీడువత్తు రనఁగాఁ దగు సాహసదానసద్గుణం
బులు ధరయందుఁ బుట్టఁగనె పుట్టినయచ్యుతభూమిజానికిన్.

శా. వీరాగ్రేసరుఁ డర్థిపోషణగుణావిర్భూతభాస్వద్యశో
ధారేయుఁడు మణీతులాదికమహాదానావళు ల్సేయఁ దా
నారా మార్గము వెట్టినట్టిఘనుఁ డావా[illegible] లోకముం దచ్యుత
క్ష్మారాణ్మౌని యొనర్చుపుణ్యమహిమల్ శక్యంబె లెక్కింపఁగన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

్యఫలంబున నె ద, యాపాథోంశి రైనయలయచ్యుతభూ
తికిన్ రఘునాథ, క్ష్మాపాలుం డుదయ మయ్యె జైవాతృకుఁ డై. 16

న దాదిగాఁ దనదుపుణ్యమె దాదిగ వైరిభూమిభృ
ుదంబు దా దిగ సదాదిగధీశనుతప్రతాపుఁ డై
ుహాభిషేకబహుభాగ్యధురంధరుఁ డై యయోధ్య య
ణ మేలుసామియై యనన్ రఘునాథవిభుండు వర్ధిలున్. 17

ంబ డారఘునాథుకీర్తిసతి యారా తొల్త వాగ్బంధమున్
ాదంబును రాజవశ్యవిధి నేరంబోలుఁ గాకున్న వె
ుపుంబౌ్రిధి ఐహించి శేషఫణి మూఁగం జేయఁ దారాద్రి ను
ు ల్వాల్కఁగ ఛత్త్రిచామరమహాలక్ష్ము ల్గనన్ శక్యమే. 18

ుగ నెన్న నైనరఘునాథనృపాలుఁడు గల్గఁగా మహీ
ిఖిలైకధర్మములుఁ దామరతంపర లై చెలంగెఁ గొ
ప్రవేశసజ్జనకులంబు సుఖంబు గనెన్ సమస్తవి
ుఁ గస కెల్లఁ బాసి మొఱపై వెలవెట్టె సభాంతరంబులన్. 19

ము లెక్క యష్టమదసామజమాళులమీఁదుగా మహా
శ్రీము వెన్ను దాఁటి పలుగొమ్ము మొనం బడి సర్వదావిష
ంగులు గ్రమ్ము శేషుతలచాయనె యొడక వచ్చి కూడె నా
లితాంగి కెంత వలపో రఘునాథనృపాలునందునన్. 20

కరాంతోర్వరావిహారుం డౌట, నగ్రహారము లసంఖ్యముగఁ జేసె
దానవినోది యగుటఁ గక్ష్యాంతర, భద్రసంభీక్షణపరతఁ దనరె
ఃనాయకోత్తముఁ డౌట మేలైన, మలయజగంధిమండలము నేలె
విద్యాధురంధరుఁ డౌట రంగస్థ, లంబు రామాలంకృతంబు చేసె
కర్ణాటసింహాసనాధిరాజ్య, భరణనిపుణగుణోద్దండబాహుదండ
సాపత్న్యసంవాదజయరమామ, హీలలితకేళి రఘునాథనృపతిమౌళి. 21

ున్ భోగియు సౌమ్యుఁడున్ గవియు సర్వజ్ఞుండు నీడౌ ననన్
ప్రౌఢమచో వివేక నయ భూతి శ్లాఘలన్ మించు నా
న్ భోగియు సౌమ్యుఁడున్ గవియు సర్వజ్ఞుండు నెబ్బంగులన్
జింపన్ రఘునాథభూరమణసర్యుండే ధరామండలిన్. 22

సింగపుఁబల్ల మమరించె నేరాజు, మేలుఁదేజికిఁ బదివేలు సేయఁ
బంగరుదిండ్ల పికిలికుచ్చులయందు,లం బెక్కె నేరాజు లక్షసేయఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గనకమయంబుగాఁ గట్టించె నేరాజు, సాటి లేనినగళ్లు కోటి సేయ
గంఠమాలిక మొదల్ గాఁ బెట్టె నేరాజు, గొప్పసొమ్ములు పదికోట్లు

తే. నతఁడు విభుమాత్రుఁడే బహుళాగ్రహార, నిత్యసత్త్రిమహాదాననిక
తాహిమాచలసేతుద్విజాభిగీర్ణ, పుణ్యవిభవుండు రఘునాథభూవిభుండు

చ. త్రికరణశుద్ధి సచ్యుతుని శ్రీరఘునాథనృపాలువైఖరిన్
సకలమహీసురావళికి సత్త్రిము లెప్పుడు బెట్టలేఁడ కా
యొకదొరయందు లెక్క విని యొక్కకనాఁటికి యింతయొక్క మి
తకుఁ దెగసాగినా యనక తా మదమందినఁ జాలు నెమ్మదిన్.

సీ. అడుగుమాత్ర మెకాక యంత కెక్కుడుగ నీఁ, జాలెనే యల బలి చ
యావేళ కటుదోఁచినంతమాత్రమెకాక, కోర్కెకిచ్చెనె యర్క
తూఁగినమాత్ర మిత్తునని గా కిచ్చెన, చ్చినది కొమ్మనె శిబివిభు
కలమాత్ర మపు డిచ్చెఁ గాక కట్టెడ గాఁగ, ననిశంబు నిచ్చెనే యస
తే. వారి నేరీతిఁ బ్రతిసేయవచ్చు నెల్ల, యర్థుల గృతార్థుల నొనర్చునట్టి
తీపవితరణికి మహాప్రతాపతిగ్మ, ఘృణికి నచ్యుతరఘునాథనృపతిమణికి.

ఉ. తప్పులు వేయుఁగల్గినను దాసును నమ్మినవారిపట్లఁ దాఁ
జెప్పినమాట యూర్జితము సేయు నొకండొకమీఁదఁ గొండెముల్
సెప్పిన వానికై మనవిచెప్పినరీతిగ నెంచు నీడుగా
రిప్పటిరాజు లచ్యుతనరేంద్రుని శ్రీరఘునాథశౌరికిన్.

సీ. ఆకారమున నలునంతవాఁ డౌనె కా, హయసమ్యగారూఢి నంతవాఁడె
యతిదయామతి రామునంతవాఁ డౌనె కా, యసమానగురుభక్తి నంతవా
యమృషోక్తి ధర్మజునంతవాఁ డౌనె కా, యన్నసత్త్రిఖ్యాతి నంతవాఁ
యాలంబునఁ గిరీటియంతవాఁ డౌనె కా, యమితనాట్యప్రౌఢి నంతవా
తే. రసికమాత్రుండె యంతఃపురప్రవీణ, సారసారస్వతాధారశారికాశు
కవనకృతముఖశుకకళాకలనహృష్ట, బుధజనాస్థాని రఘునాథభూమిజాని

ఉ. మాటలనేర్పులా సరసమార్గములా కొలువుండురీతులా
పాటలగంధులా కళలభాగ్యములా బహుదానలీలలా
నాటకశాలలా యొక టనన్వల దెన్నిటఁ జూడ నన్నిటన్
మేటియుఁ గీర్తిలోలుఁడుఁ భూమి రఘునాథనృపాలుఁ డిమ్మహిన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అని రఘునాథమహీకాంతు ననంతశోభనగుణమ్ములలోనఁ గొన్ని యభివర్ణ

న్న నడిపినబహుళసన్మాన మెంచి, యఖిలవిద్యావిశారదుఁ డగుటఁ గాంచి
పని నింతటిరా జెవ్వఁడని నుతించి, కృతు లొసఁగఁ గీర్తి కల దని మతిఁ దలంచి.

గా రసపుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గు ననేకకృతుల్ ప్రసన్నగం
రగతిన్ రచించి మహి మించినచో నిఁక శక్తు లెవ్వర
న్యా రఘునాథభూపరసికాగ్రణికిన్ జవి సోఁకఁ జెప్పఁగన్. 31

గెం గాఁ దనసమ్ముఖం బనియె సత్కారంబు తాఁ జేయ నా
నెందే శిరసా వహింతు రనియుం దాఁ గాక లే దెందు సా
చలకుం దిక్కనియుం దయన్ మనుపురీతు ల్గాక శక్యంబె వి
ర్కల మెప్పింపఁగ నచ్యుతేంద్రరఘునాథస్వామి నెవ్వానికిన్. 32

గణియించి వైనను గుణాంశ మొకించుక కల్గినం బళా
య నదిగాక మిక్కిలి నిజాశ్రితపక్షము గల్గు సత్కృపా
యణుమాత్ర మైన నొక కానుకఁ దెచ్చినఁ గొండగాఁ గనన్
మున నచ్యుతేంద్రరఘునాథుఁడె శ్రీరఘునాథుఁ డెన్నఁగన్. 33

వున నే నొనరించిన, యీవిజయవిలాస మనెడి కృతిరత్నంబున్
లభక్తిని గానుక, గావించెద నని నితాంతకౌతూహలినై. 34

వాసరమున నయ్యెడ, నిభరాజముఖోపదానిరీక్షేచ్ఛ మహా
గాభిరాముఁ డై భా, వభవాకృతి భద్రపీఠవాసోజ్జ్వలుఁ డై. 35

నంపుఁబసిండి కుళ్ళాయిజగలపైఁ, జౌకట్లనిగనిగ ల్చాకళింప
ముంజిముత్యాలయరచట్టపై గొప్ప, పతకంపుహారము ల్పరిఢవిల్ల
జెప్పరానికెంపులపంకజము దాడి, పీతాంబరంబుపైఁ బెరిమె నెఱప
మన్నెకుమారగండపెండారంపు, జిగి పదాగ్రంబుపైఁ జెంగలింప
మంత్రులఁ గవుల నాదరణ సేయు, కరముకంకణకాంతి నల్గడల నిండ
కొలు వుండెఁ గన్నులపండువుగను, ఠీవి నచ్యుతరఘునాథ భూవిభుండు. 36

లొడ్డోలగం బున్నయవసరమున
భయసంభ్రమములు నావెంట నంట
గృపాదృష్టిఁ జల్లఁగాఁ గనుచు నుండ
మ్మున కరిగి యంజలి ఘటించి. 37

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ఏలికమాత్రమే మహిమ నీశ్వరుఁడే తలపోసి చూడ నా
పాలిటిరామభద్రుఁ డని బంగరుఁబూవులఁ బూజ చేసి నేఁ
జాల నలంకృతిం బొసఁగుసత్కృతి కానుక చేసి కీర్తి భూ
శ్రీలలితాంగులన్ వలవఁ జేసిన శ్రీరఘునాథశౌరికిన్.

ఉ. శ్రీరసభావముల్ వెలయఁ జెప్పి ప్రబంధము లెన్నియేని మీ
పేరిట నంకితం బిడిన బిడ్డల నెందఱఁ బేరుపెట్టినన్
దీరునె మీఋణం బయినఁ దెచ్చితిఁ గాన్క పరిగ్రహింపు మ
య్యా రఘునాథభూపరసికాగ్రణి మామకకావ్యకన్యకన్.

సీ. ఘోటక ఖుర పుట క్షుణ్ణ ధరా జాత, పాంసువుపై నుల్లభంబు గాఁగ
భటసింహవిక్రమోద్భటసింహనాదముల్, స్వస్తివాదంబులచంద మొందఁ
బదిదిక్కు లొక్కటఁ బగిలి బీఁటలువాఱ, భేరీనినాదముల్ బూరటిల్ల
విజయ సమారబ్ధ వేళ కౌతుకమున, మొగమున గరువంపుమురువు దోఁప
తే. నార పెండ్లికి నేఁగిన ట్లనికి నేఁగి, యక్షతంత్రంబు లివి యేటిలక్షు మనుచు
లేక మోనక గెల్చుట నీకె చెల్లు, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక.

సీ. ఎంచి రంటివి గాని యీసారి గట్టిగాఁ, జెగుఁ గార్య మనువార్తఁ దెలుపవైతి
మించి రంటివి గాని మేదిని యుదరంగ, నడిచె సైన్యం బని నుడువ వైతి
పంటి రంటివి గాని యాభీలతరభటో, ద్భటసంగరం బని పలుక వైతి
మొగిసి రంటివి గాని ముకుటము లెత్తిగి రాజ, శేఖరుల్ పడుట సూచింప వైతి
తే. వనుచు నీధాటి కరవాలునహితవీరు, లదరు ననుమాట వెడలక బెదరి పల్కు
చారుఁ గని నేర మెంతుదు సారెసారె, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక.

సీ. భిన్నకటంబులై పేరు పెంపును లేక, గంధనాగంబు లెక్కడ నడంగె
బాహ్లీక శక సింధు పారసీకోద్భవ, హయఘట్ట మేగొందియందు డిందెఁ
బోటుగంటులఁ దూటి పోవుదారుణ మైన, మాస్టీలగమి యెందు మ్రగ్గి పోయె
గర్వంబు మేనులు గన్నట్టు లుండెడు, దొరలయామిక లెందుఁ దొలఁగి పోయె
తే. బరులపాళెంబు లీరీతిఁ బన్న మొంద, మాయ పన్నెను నీఖడ్గ మంత్రవాది
గెలిచినను నేటిమేలైన గెలుపు గంటి, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక.

సీ. రంభ వాకిటను దోరణములు గట్టెడు, తీవర మొకకొంత దీలుపడియె
మేనక యింటిలో మేల్కట్లు సవరించు, సంరంభ మొకకొంత సడలువాఱెఁ
గనకాంగి యింటిలోఁ గర్పూరవేదికల్, సవరించు టొకకొంత జాగుపడియె
హరిణి బంగరు మేడ నరవిరి సజ్జలు, నర్పించు టొకకొంత నిలుకడయ్యె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. మబ్బుగొబ్బున నీశౌర్యమహిమ వినక, తెగువతోడుత నెదిరించి తిరిగి విఱిగి
పాఱిపోయినమన్నీలపాటు సూచి, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 43

సీ. అతుల భూరి ప్రతాప పార్కదీధితిచేతఁ, గట్టిగాఁ గాఁకలు పుట్టు పిదప
ఘోరారి గళ రక్త ధారాళి స్పృష్టిచే, నాని దుక్కికిఁ బద నైనపిదప
హయ దట్ట ఖుర పుట హల్యా ముఖంబున, నంతట దున్నినయట్టిపిదప
మొలచిననీకీర్తిమొలకలు తలుచుగా, వెదపెట్టి పైరు గావించుపిదపఁ

తే. గాపు నిలుపవె బేతాళగణము నెల్ల, నట్టిపట్టుల కరిగి నీ పరుల నోద
పాటు చేసితి వనుట యేపాటి తలఁప, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక.

సీ. ఒకరు వోయినదెస కొకరు వోవక పాఱు, నరివీరులకు దావా గరిమ మించె
గడగడ వడఁకి న ల్గడల కేఁగక భీతిఁ, జెందినవారిపైఁ జెమట పుట్టె
మున్నాడి యెలగోలు మూఁకలఁ బోట్లాడు, పరులపైఁ బాటలప్రభలు మీఱెఁ
జేగ దెచ్చుక కొంత సిగ్గున నెదిరించు, రాజులయొప్పు బీరము దొలంగెఁ

తే. దెగువతోడుత ధరియించి తీవ్ర కోప, భరిత రూక్షాక్షి నియమిత ప్రభలపేర
నీవు ఘూర్ణార్కవిస్ఫూర్తి నెఱపునపుడు, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక.

సీ. తలలు వీడఁగఁ బాఱు ధరణీశ్వరులఁ జూచి, యంటి వెన్నాడనియట్టిమహిమ
పడినయేనుంగులప్రక్కల కొదిగిన, రాజులఁ జూడనిరాజసంబు
జళిపించుచంద్రహాసములు పాఱఁగ వైచి, మ్రొక్కువారలమీఁద మొనపుకరుణ
నెత్తురు గనుపట్టి వత్తినభీతిచేఁ, గలవరించినవారిఁ గాచుగరిమ

తే. మెన్నఁ బనమీఁద బలముతో నెనసి మొనసి, విఱుగురాణువఁ బొమ్మను వీరవరుని
కీర్తి గంటిమి జగదేక కీర్తనీయ, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 46

క. అని విన్నవింపఁ జిత్తము, ననలొత్తఁ బరిగ్రహించి నాపై నింతిం
తనరానివత్సలత్వము, కనిపింపఁగ హర్ష భర వికస్వర ముఖుఁడై. 47

తే. కల నయిన మిమ్ము గా కన్యుఁ గొలువ నంటి
కృతు లొకరి కీను మీకె యంకితము లంటి
పలికినప్రతిజ్ఞ చెల్లింప వలదె యిట్లు
వాఙ్నియమరూఢి నీయంత వాఁ డికేఁడి. 48

క. వాసించుఁ గవిత చెప్పిన, వీసర వో వొకట భక్తివిశ్వాసంబుల్
నీసామ్ములు సామాన్యుఁడ, వే సూర్యవరప్రసాది విజ్జగ మెఱుఁగన్. 49

క. ప్రతిపద్యమునందుఁ జమ, త్కృతి గలుగం జెప్ప నేర్తు వెల్లెడఁ బెలు కా
కృతి వింటి [illegible] 50

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. క్షత్త్రిధర మెకఁడ నీకుఁ గలఁడి మొదలఁ
దమ్ములు సుతుల్ హితులు గూడ మమ్ముఁ గొలిచి
తిప్రుడు కృతియును జెప్పి మా కిం పొనర్చి
తొకటఁ గా నన్నిటను బ్రయోజకుఁడ వీవు. 51

తే. అని సుధామధురోక్తుల నాదరించి, మంజులపదార్థభూషణాంబరకదంబ
కరి తురంగాది వాహనోత్కరము లిచ్చి, నన్నసాధారణముగ మన్ననయొనర్చె. 52

చ. అభినవభోజరాజబిరుదాంకుఁడు శ్రీరఘునాథశౌరికిన్
శుభమతి నేలినందులకు నూడిదచేసితి నార మిక్కిలిన్
సభల గణింప మన్నన లొనర్పఁ బ్రబంధము నింతయుత్తమ
ప్రభునకు నంకితం బొనరుపం గలిగెం గద యంచు వేడుకన్. 53

ఉ. ఆనతి యిచ్చెనా యది శిలాక్షర మెవ్వని నేని మెచ్చెనా
వానిఁ గృతార్థుఁ జేయుఁ బగవాఁ డయినన్ శరణంబుఁ జొచ్చెనా
యానరు నేర మెంచక తనంతటివాని నొనర్చు నిచ్చెనా
యేనుఁగుపాఁడి యీడు గలదే రఘునాథనృపాలమౌళికిన్. 54

ఉ. ఎందును విద్యలే రెఱుఁగ రెవ్వ రెఱింగినఁ గొంతమాత్రమే
యందును సాహితీరసమహత్త్వ మెఱుంగ రెఱింగి రేని యా
యంద మెఱుంగ లే రెఱిఁగినప్పటికిన్ విని మెచ్చి యీయ రె
న్నం దగు నచ్యుతేంద్రరఘునాథవిభుండె ప్రవీణుఁ డన్నిటన్. 55

సీ. ఏరాజుభుజశౌర్య మేదులఖానాది, వజ్రీలచెలిమికి వశ్యవిద్య
యేరాజువిక్రమ సారంబు విద్వేషి, మహిమపలాయనమంత్రశక్తి
యేరాజువీక్ష సమీహితకర్ణాట, రమనాట్యవిద్యకు రంగభూమి
యేరాజుచరితంబు వారాశివేష్టిత, మేదినీపతులకు మేలుబంతి
తే. యతఁడు చెలువొందుఁ జినచెవ్వయచ్యుతేంద్ర
బహుజననపుణ్యపరిగణ్యఫలనిభాత్మ
పుత్త్రీభావప్రమోదసంపూర్ణహృదయ
పంకజాతుండు రఘునాథపార్థివుండు. 56

సీ. సింహాసనము మాట శిథిల మౌటలు విని, గట్టిగా నిలుపఁ గంకణము గట్టెఁ
గోటిసంఖ్యలు మీఱఁ గూర్చినధనరాశి, గొల్చువారల కిచ్చెఁ గొల్చువలెనె
తుండీర పాండ్యాది మండలేశ్వరులపై, దండెత్తి విడిసె నుద్దండమహిమ
నేల యీనినయట్ల నిలిచినవైరులఁ, బంచబంగాళమై పాఱఁ దఱిమె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. గర్వితారాతిమ స్తకఖండనోత్థ, రక్తధారానుషంగాతిరక్తధార
నిజకృపాణికఁ గావేరిసీటఁ గడిగె, నిఖిలగుణశాలి రఘునాథ నృపతిమౌళి. 57

సీ. ఘనఘనాఘనముల కాలసంకెలఁ బెట్టు, పాండ్యుని వెన్నాడి పాఱఁ దఱిమెఁ
దుండీరనాథుండు దురమునఁ బరవంగఁ, జూచి ప్రాణము దయఁ గాచి విడిచెఁ
గయ్యాన వెనుకఁ ద్రొక్కనిరాజు లెదిరింపఁ, జేరిన రాజకాళికులఁ బట్టెఁ
బోరాడఁగా రానివైరులకోటలు, పంపులచే లగ్గపట్టి తివిచె

తే. నితఁడు సామాన్యుఁడే ధర నెంచి చూడ, విజయ నిస్సాణ రాణ నిర్విణ్ణహృదయ
భీత రాజన్యసైన్య నిర్భీతి దాన, బిరుద నిజ పాణి రఘునాథ భిదురపాణి. 58

ఉ. ఇచ్చునెడన్ బదార్థ మడి గిచ్చునొ తా దయసేయఁ గా దనన్
వచ్చునొ మించి యెక్కుడఁ డన వచ్చినఁ దా నది యిచ్చగించునో
యిచ్చిన నిచ్చునే సరగ నెవ్వరిపై దయచేసెఁ జేసెనే
యచ్చతురాస్యుఁడుం దెలియఁ డచ్యుతుశ్రీరఘునాథుచిత్తమున్. 59

## షష్ఠ్యంతములు

క. ఏతాదృ గ్గుణ ఖనికిన్, సీతాదృ ఙ్మోహ నాంఘ్రి సేవా ధనికిన్
శా తాసి కలిత బాహా, స్వీ తాసిక విమత రాజ నిఖి లావనికిన్. 60

క. సాక్షాన్మనోజునకు క్షో, ద క్షమ రస భావ సుకవితా భోజునకున్
దాక్షిణ్య గాంగేయునకున్, దక్షిణ సామ్రాజ్య విభవ ధౌరేయునకున్. 61

క. సు స్థిర లక్ష్మీమహిత మ, ణి స్థగిత గృ హాంగణునకు నేపాళ నృపా
ల స్థాపన చణునకు సక, లాస్థాన ప్రణుత వర గు ణాభరణునకున్. 62

క. కీర్త్యాదా ర్ద్యాధరి తా, మ ర్త్య మహీరుహ సుధాబ్ధి మహికౌఘ్రుణికిన్
ధౌ ర్త్యవ దరి కరి సృణికిన్, మూ ర్త్యంబా గర్భ శు క్తి ముక్తామణికిన్. 63

క. అఘటన ఘటనా చాతు, ర్య ఘనోర్జిత కార్య నిర్వహణ ధూర్వహ ధీ
మఘువాచార్యున కచ్యుత, రఘునాథ వసుంధరాధిరాడ్వర్యునకున్. 64

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనినవిజయవిలాసం బనుశృంగార ప్రబంధమ్మునకుఁ గథాక్రమం బెట్టి దనిన నైమిశారణ్యమహర్షులకు రోమహర్షణి యి ట్లని చెప్పం దొడంగె.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ ర స్తు

# వి జ య వి లా స ము

## ప్ర థ మా శ్వా స ము

శా. చంద్ర ప్రస్తర సౌధ ఖేలన పర శ్యామా కుచద్వంద్వ ని
స్తంద్ర ప్రత్య హ లిప్త గంధ కలనా సంతోషిత ద్యోధునీ
సాంద్ర ప్రస్ఫుట హాటకాంబురుహ చంచ చ్చంచరీకోత్కరం
బింద్రప్రస్థపురంబు భాసిలు రమాహేలాకళావాస మై. 1

ఉ. ద్వారక ముద్దుఁజెల్లెలఁట తన్నగరీమణి సృష్టి యన్నిటం
దీరుగ నైనచో నిదియ నేర్పులమే రని యెంచి చేసెఁ బో
ధారుణి విశ్వకర్మ గుఱి దానికి నెక్కుడ యీడులేనిసిం
గారము గల్గు నట్లు వెనుకన్ సృజియింపక యుండునే సుమీ. 2

క. వెండియుఁ బైఁడియుఁ దడఁబడు, చుండుం బురి నెందుఁజూడ నుండఁగవలయున్
భండారము లై యుండఁటే, యిందులఁ గైలాస మేరు పృథ్వీధరముల్. 3

సీ. తడఁబాటు గలదు వేదముల నాతని కంచుఁ, బరమేష్ఠి మెచ్చరు ధరణిసురులు
కడమాటు పగవానిఁ గని చే మఱచె నంచు, భార్గవు మెచ్చరు బాహుజనులు
పనికి రా కొకమూలఁ బడియె నాతనివస్తు, వని కుబేరుని మెచ్చ రర్యజనులు
వీటిపా టైన నాఁగేటిపాటున మించు, నని హలాయుధు మెచ్చ రంఘ్రిభవుల

తే. పాడిఁ దప్పక ధర్మంబు పట్టువిడక, లక్షలకు నమ్మఁ జాలి నల్గడల భూమి
వరులు మే లనఁ దగి యిట్లు పురిఁ బొలుతురు, చదువుసాములధనధాన్యసంపదలను

ఉ. ఏసరి యైనదేవతటినిం గలఁగించెద నే నడంపుమా
వాసరి శేషపన్నగఫణానివహంబు నటంచు నప్పురిం
బాసలు సేసికొన్న వన భాసిలుఁ సాలశిఖాళి ఖేయముల్
మోసమె యైన విష్ణుపదముం బలిపీఠము ముట్ట నేటికిన్.

ఉ. రే లమృతాంశులోశశము రెమ్ముద ముచ్చుఁ దలంచి జాళువా
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
మేలిపసిండిసోయగపు మేడల గుజ్జెనగూళ్లసందడిన్

బాలిక లుండి యావలఁ జనం గని చింతిలి వంటయింటికుం
దే లిది యెందుఁ బోఁగలదు నేఁటికి నే మని యందు రందులన్. 6

ఉ. పున్నమ రేలఁ దత్పురముపొంతనె పో శిఖరాళి దాఁకి వి
చ్ఛిన్నగతిన్ సుధారసము చింది పయిం దిగవాఱ నంతనుం
డిన్నెల సన్నగిల్లు నది నిక్కము గా దని రేని యా పదా
ర్వన్నెపసిండిమేడలకు రాఁ బని యే మిల సౌధనామముల్. 7

ఉ. వేడుక నప్పురీహరులవేగముఁ గన్గొని లేళ్ల గాడ్పుతోఁ
గూడి చనన్ వలెన్ మనము గూడఁగ నోపక యోడినట్టివా
రోడనివారి మోచు టని యొద్దికఁ బందెము వైచి కూడ లే
కోడెనొ కాక మోయఁగఁ బ్రయోజన మే మనిలుం గురంగముల్. 8

ఉ. చుట్టును గట్టి యుండు నొకచో నెడ మించక లేకయుండఁ ద
త్పట్టణబాహ్యభూముల మహావళిమండల మేమి చెప్ప ని
ట్టట్టు దెమల్ప రా కరిభయంకర మై దివితోడ రాయుచున్
బెట్టనికోట గాదె గజబృందము లెందును రాజధానికిన్. 9

ఉ. గాళకు లాపురీభటశిఖామణు లెక్కటియుక్కుతున్క లా
భీలత రాశను ల్చిదిమి పెట్టినబంటులు వైరి కెల్ల బే
తాళుఁడు వచ్చి డగ్గఱిన దబ్బర గా దొగదెబ్బ దీయఁగాఁ
జాలుదు రేమి చెప్ప మఱి సాదననేటును సాహసంబులన్. 10

సీ. ఆరామసీమలయందు నుండి పసళ్లు, ముద మెసంగ వసంతుఁ డెదురుచూచు
మునిమాపుకడలఁ గ్రొన్ననవింటి నెఱజోదు, కేళిమందిరములకెలనఁ జూచుఁ
బ్రొద్దు వోయినవేళ రోహిణీప్రాణేశుఁ, డుదిరిమేఁడల మీఁద వెదకి చూచుఁ
వెలతెలవాఱంగ మలయగంధవహుండు, సోరణగండ్లలోఁ జొచ్చి చూచు

తే. నాపురివిలాసవతులయొయ్యారములకుఁ, గడు సొగసి వారికాకలు కాచి కాచి
విరహులఁ గలంచువారె యివ్విధము గాఁగ, నున్నవారల నిఁక వేఱె యెన్న నేల.

క. మగవానిని మగవాఁడును, మగువను మగువయును వలచు మఱి యే మన న
న్నగరపురాజకుమారుల, జగిబిగిసోయగము చెలువలసింగారంబుల్. 12

చ. పొలయలు కాని యున్నపువుఁబోణులు ఖండిత నాయికా లలా
మలు మది నియ్యెకోల్ వలయుమానిను లేటికి వచ్చె నమ్మ తాఁ
బిలువనిపేరఁటం బనుచు బెగ్గిలి నాథులఁ గౌఁగిలింపఁగా
బొలుపుగ నందుఁ [illegible] 13

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri.

ఉ. ప్రాయపు గాయకు ల్వెలనెపాన నెగాదిగఁ జూడ నేర్పు లౌ
రా యివి దండ మీఁదఁ గొసరం దొరఁకొంటిరి మంచిసాములే
పో యటు లైనచో సరసము ల్గద మీ కిపు డంచు నప్పురిం
గాయజుతూపు లమ్మదురు కందుపమాటలఁ బుప్పలావికల్. 14

సీ. గొప్పలై మిన్నందుచప్పరా లెక్కి లాఁ, గులు వైచుచోఁ జంద్రకళ లనంగ
గనకంబు వర్షించుఘనులమ్రోల నటించి, మెఱయుచోఁ దొలకరి మెఱుపు లనఁగ
మాటికిఁ జూపఱ మది కాసఁ గొల్పుచోఁ, బ్రతిలేనిబంగారుప్రతిమ లనఁగఁ
గుపితనాథులఁ గూర్మిఁ గొసరుజంకెన నాటఁ, గనుచో మరుశిలీముఖము లనఁగ
తే. జెలఁగి యింపుగ నగఁ బాడఁ జెప్పఁ జదువ, వలప వలపింప నేర్చినయలరుఁబోండ్లు
విపుల భరత కళాశాస్త్ర నిపుణ లైన, బిరుదుపాత్రలు గలరు తత్పురమునందు.

సీ. అతివినోదముగాఁగ రతుల మెప్పించు నీ, పచ్చలకడియాలపద్మగంధి
చక్కెరమో విచ్చి చవులఁ దేలించు నీ, ముత్యాలకమ్మలముద్దులాడి
తృణముగా లోఁజేయు నెంతటివాని నీ, నీలాలముంగఱనీలవేణి
వెలలేనిపొందిక విడివడి మెఱయు నీ, కెంపులబొగడలకీరవాణి
తే. యనుచుఁ దమలోన నెఱజాణతనము మీఱ, వారకాంతామణులమేలువార్త లెల్ల
వెన్నెలబయళ్ల గేలి గావించి నరుచు, విటులు విహరింతు రప్పురి వీథులందు. 16

తే. పోఁకమ్రాఁకులమహిమ కప్పురపుటనఁటి, యాకుఁదోఁటలభాగ్య మందె కలదు
ప్రబలుమౌక్తికసౌధసంపదలమహిమ, వీటిరహి మెచ్చవలయుఁ బో వేయునోళ్ల. 17

ఉ. ఆణిమెఱుంగుముత్తెపుటొయారపు మ్రుగ్గులు రత్నదీపికా
శ్రేణులు ధూపవాసనలు హృద్యనిరంతరవాద్యఘోషముల్
రాణఁ బొసంగఁ బ్రోలు మిగులం గనువిం దొనరించు నిత్యక
ల్యాణముఁ బచ్చతోరణము నై జను లందఱు నుల్లసిల్లఁగన్. 18

ఉ. ఆపుర మేలు మేలు బళి యంచుఁ బ్రజల్ జయవెట్టుచుండ నా
జ్ఞా పరిపాలన వ్రతుఁడు శాంతి దయాభరణుండు సత్యభా
షా పర తత్త్వకోవిదుఁడు సాధుజనాదరణుండు దానవి
ద్యా పరతంత్ర మానసుఁడు ధర్మతనూజుఁ డుదగ్ర తేజుఁ డై. 19

శా. దేవబ్రాహ్మణభక్తిప్రోవు ప్రియసత్కృత్యంబు కాణాచి వి
ద్యావైదుష్యముదిక్కు ధర్మమునకుం దార్కాణ మర్యాదకుం
దా వౌచిత్యముజీవగఱ్ఱ హితశిష్టవ్రాతసంతోషణ
శ్రీవజ్రాంగి య[illegible]త్రుఁడు మహీభృన్మాత్రుఁ డై చూడఁగన్. 20

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. అవలఁబోయిన వెన్క నాడు టెన్నఁడు లేదు, మొగముముందఱ నంట మొదలె లేదు
మనవి చెప్పినఁ జేయ కునికి యెన్నఁడు లేదు, కొదవ గా నడుపుట మొదలె లేదు
చన విచ్చి చాక చేసినది యెన్నఁడు లేదు, పదరి హెచ్చించుట మొదలె లేదు
మెచ్చినచోఁ గొం[illegible]మిచ్చు టెన్నఁడు లేదు, మొకమిచ్చకపు మెచ్చు మొదలె లేదు
తే. మఱియుఁ దొల్లిటిరాజులమహిమ లెన్న
నితఁడె పో సార్వభౌముఁ డప్రతిముఁ డనఁగ
బ్రజలఁ బాలించె సకలదిగ్భాసమాన
కీర్తివిసరుండు పాండవాగ్రేసరుండు. 21

సీ. ఎంత లెస్సగ నున్న వేడుకకే కాని, ప్రజలకల్మి కసూయపడుట లేదు
తనుఁ గొల్వవలె నంద అను ప్రియంబె కాని, మానిసి వెగ టించు కైన లేదు
నిచ్చ వేఁడిన నర్థి కిచ్చు చిత్తమె కాని, మును పింత యిచ్చితి ననుట లేదు
రేవగల్ ధర్మ మార్జించుదృష్టియె కాని, న్యాయంబు దప్పిననడక లేదు
తే. కలఁడె యిటువంటిరాజు లోకమున నెందు, జలధి వలయిత వసుమతీచక్ర మెల్ల
నేలవలె శాశ్వతముగాఁగ నీఘనుండె, యేల వలె నన్యు లన నాన్నృపాలుఁ డలరి. 22

ఉ. కోప మొకింత లేదు బుధకోటికిఁ గొంగుఁబసిండి సత్య మా
రూపము తారతమ్యము లెఱుంగు స్వతంత్రుఁడు నూతనప్రియా
టోపము లేనినిశ్చలుఁ డిటుల్ కృతలక్షణుఁ డై చెలంగఁగా
ద్వాపరలక్షణుం డనఁగ వచ్చునొకో యలధర్మనందనున్. 23

క. దుర్జయ విమతాహంకృతి, మార్జన యాచనక దైన్య మర్దన చణదోః
ఖర్జులు గల రతనికి భీ, మార్జున నకుల సహదేవు లనునసుజన్మల్. 24

క. పంచామరతరులో హరి, పంచాయుధములొ గిరీశుపంచాస్యములో
యంచుఁ సకలజనంబులు, నెంచఁ బాండవులు వెలసి రేవురు ఘనులై. 25

చ. ఒరిమయు భక్తియు న్నెనరు నోర్పుఁ గనంబడఁ బెద్దపిన్నయం
తరువు లెఱింగి మాట జవదాఁటక చెయ్వుల వేఱు లేక యొం
డొరులమనమ్ములో మెలఁగుచుండిరి పాండుకుమారు లెంత నే
ర్పరు లిల నన్నదమ్ములసరాగము వారలదే సుమీ యనన్. 26

ఉ. అన్నలపట్లఁ దమ్ములయొడాటమునన్ సముఁ డంచు నెన్నఁగా
నెన్నిక గన్నమేటి యెదు రెక్కడ లేక నృపాలకోటిలో
వన్నెయు వాసియుం గలిగి వర్తిలుపౌరుషశాలి సాత్త్వికుల్
తన్ను నుతింప [illegible] నెంతయున్. 27

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. అతని నుతింప శక్యమె జయంతునితమ్ముఁడు సోయగంబునన్
బతగకులాధిపధ్వజునిప్రాణసఖుండు గృపారసంబునన్
క్షితిధరకన్యకాధిపతికిన్ బ్రతిజోదు సమిజ్జయంబునం
దతని కతండె సాటి చతురబ్ధి పరీత మహీతలంబునన్.

తే. పాఱఁజూచినఁ బరసేన పాఱఁజూచు, వింటి కొరగిన రిపురాజి వింటి కొరగు
వేయు నేటికి నలపాండవేయుసాటి, వీరుఁ డిల లేఁడు ప్రతి రఘువీరుఁ డొకఁడు

క. అతిలోక సమీక జయో, న్నతిచే ధర్మజున కిం పొనర్చుచు వినయా
న్వితుఁ డై సమస్తజన స, మ్మతుఁ డై నరుఁ డుండె నిటు లమానుషచర్యన్.

ఉ. అంతట నొక్కనాఁడు గదుఁ డన్ యదువంశభవుండు రుక్మిణీ
కాంతుఁడు కూరిమిన్ బనుపఁగాఁ గుశలంబరయంగ వచ్చి యే
కాంతపువేళ ద్వారవతియందలివార్తలు దెల్పుచున్ దటి
త్కాంతి మనోహరాంగు లగు కన్నెలచక్కదనంబు లెన్నుచున్.

పంచచామరము. కన న్సుభద్రకు న్సమంబు గాఁగ నేమృగీవిలో
కనన్ నిజంబు గాఁగ నేజగంబునందుఁ జూచి కా
కనన్ దదీయ వర్ణనీయ హావ భావ ధీ వయ
కన న్మనోజ్ఞ రేఖ లెన్నఁ గాఁ దరంబె గ్రక్కునన్.

ఉ. ప్రాయపుఁ డెక్కునన్ జెలువపల్కులు చిల్కల గారవించు గ
న్దోయి చకోరపాళి దయతోఁ బెనుచుం జనుకట్టు మచ్చికల్
సేయు సదా రథాంగయుగళి న్నడ లంచల బుజ్జగించు నా
నేయెడ నింపు గావు గణియింప నవీన వయో విలాసముల్.

చ. అతివకుచంబులు న్మెఱుఁగుటారును వేనలియున్ ధరాధిపో
న్నతియు నహీనభూతికలనంబు ఘనాభ్యుదయంబు నిప్పు డొం
దితి మని మాటిమాటికిని నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీఁగెడున్
క్షితి నటు గాదె యొక్కొకరికి న్నడుమంత్రపుఁగల్మి కల్గినన్

సీ. కేళికాసరసిలోఁ దేలి యాడుటఁ జేసి, శైవాలలత కొంత సాటివచ్చుఁ
బుష్పమాలికలతోఁ బొందు సల్పుటఁ జేసి, యెలదేఁటిగమి కొంత యీడు వచ్చు
గంటి కింపగు రేఖ గల్గియుండుటఁ, జేసి, మినుకుఁగాటుక కొంత దినుసు వచ్చుఁ
బిఱుఁదునొయ్యారంబు మెఱయుచుండుటఁ జేసి,చమరివాల మొకింతసమము వచ్చు

తే. గాక నీలత్వమున సరి గావు తెలియ
నాతి గలిగి యొక్కొమ తైపై నడుద ్డై డ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శమ్ములై మెఱుఁగు లై కారు క్రమ్ముచున్న
వికచకమలాక్షి నునుసోగవెండ్రుకలకు. 35

ఆ. నలినలీలనంచు నలినలి గావించు, నించుమించు లాడు నించుమించు
శేమనగపుఁజూపు లేమన నగుచాపు, జగ మెఱుంగు దాని జగమెఱుంగు. 36

చ. జలరుహగంధివీనులపసల్ నవసంఖ్య నదేమి లెక్కనుల్
జెలియనఖాంకురాళి నెలచేడియ సైకముఁ దాను జుక్కనుల్
బొలఁతుకగబ్బిచన్నుఁగవ పువ్వులచెండ్లను లేదు బంతెనుల్
గలికిముఖారవింద మలకల్వలరాయనిఁ దోసిరా జనున్. 37

క. అయ్యారే చెలు వెక్కుడ, నయ్యారే గెలువఁ జాలు నంగజునారి
స్వయ్యాయులలో సరి లే, రయ్యా రుచిరాంగరుచుల నయ్యంగనకున్. 38

క. కడు హెచ్చు కొప్పు దానిం, గడవం జనుదోయి హెచ్చు కటి యన్నిటికిన్
గడు హెచ్చు హెచ్చు లన్నియు, నడుమే పస లేదు గాని నారీమణికిన్. 39

ఉ. అంగము జాళువాపసిఁడి యంగము క్రొన్నెలవంక నెన్నొసల్
ముంగురు లింద్రనీలములముంగురు లంగజుడాలు వాలుఁజూ
పుంగవ యేమి చెప్ప నృపపుంగవ ముజ్జగ మేలుఁ జేయు న
య్యంగనఁ బోలు నొక్కసకియం గనఁ బోనెఱ మించ నన్నిటన్. 40

ఉ. ఎక్కడఁ జెప్పినాఁడఁ దరశేక్షణచక్కఁదనంబు లింక న
మ్మక్క యదే మనంగ నిపు డందు శతాంశము జెప్ప లేదు నే
నొక్కొకయంగ మెంచ వలయుం బదివేలముఖంబు లాయెఁ బో
చొక్కపుఁజూపులో సొలపుఁ జూచినఁ గాక యెఱుంగవచ్చునే. 41

చ. అని బహుభంగులం బొగడ నంగన మంగల నిల్చినట్లుఁ దాఁ
గనుఁగొనినట్లు నై నృపశిఖామణి డెందమునందుఁ బట్టఁ జా
లనియనురక్తి నవ్వరవిలాసిని నెన్నఁడు చూడఁ గల్గునో
యని తమకించుచున్న సమయంబున గ్రక్కున దైవికంబునన్. 42

మ. ఒకభూమీదివిజుండు చోరహృత ధేనూత్తంసుఁడై వేఁడికొం
టకుఁ దా ధర్మజు కేళిమందిరముదండం బోయి కోదండ సా
యకము ల్దెచ్చుటఁ బూర్వక్లప్త సమయ న్యాయానుకూలంబుగా
నొకయేఁడుర్వి ప్రదక్షిణం బరుగు సుద్యోగంబు వాటిల్లినన్. 43

ఉ. అన్నకు మ్రొక్కి తీర్థ భజనార్థముగాఁ బనివిందు నంచుఁ దా
విన్నప మాచరించుటయు విప్రహితఁబునకన్న ధర్మ మే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున్నది గోప్రదక్షిణమె యుర్విప్రదక్షిణ మంచు నిట్టు లే
మన్నను మాన కన్నరుఁడు ప్రార్థన సేయఁగ నెట్టకేలకున్. 44

చ. తనదుపురోహితుం డయినధౌమ్యునితమ్ముని గారవంపునం
దనుని విశారదు న్సకల ధర్మవిశారదు వెంటఁ బోఁపగా
నొనరిచి కొండఱన్ బరిజనోత్తముల న్నియమించి యాదరం
బెనయ సమస్తవస్తువులు నిచ్చి యుధిష్ఠిరుఁ డంపె వేడుకన్. 45

చ. పరిణయ మాట కేఁగుగతిఁ బౌరు లనేకులు వెంట రా శుభో
త్తరముగ నయ్యెడం గదలి తద్దయుఁ దాలిమి మీఱ ధర్మత
త్పరుఁ డయి యందు నిందు నరపాలురు కొన్కొ లొసంగఁగా నిరం
తరమును బుణ్యతీర్థములఁ దానము లాడుచు నేగి యవ్వలన్. 46

భుజంగప్రయాతము. సునాసీరసూనుండు సూచె న్నిమజ్జ
జ్జనౌఘోత్పతత్పంక శంకా కరాత్మో
ర్మినిర్మగ్న నీరేజ రేఖోన్నమద్భృం
గ నేత్రోత్సవ శ్రీని గంగాభవానిన్. 47

క. సంతోషబాష్పధారలు, దొంతర గాఁ జూచి మ్రొక్కి తోయధివరనీ
మంతిని నాత్రిజగ ద్దీ, వ్యంతిని భాగీరథీ స్రవంతిని బొగడెన్. 48

శా. తా సైరింప కపర్దయుండఁగ భవ ద్గర్భంబునన్ దాల్చి తే
జోఽసహ్యు న్శరజన్ముఁ గాంచి యల నీహార క్షమాభృత్కుమా
రీ సాపత్న్యముఁ గన్నమోహపుఁబురంధ్రీరత్న మౌ దీవ కా
వే సర్వజ్ఞుఁడు నిన్ను నేల దలపై నెక్కించుకో జాహ్నవీ. 49

క. పెల్లుసెగఁ జల్లువిస మా, తెల్లనిదొర కుతిక మోవఁ దిన బ్రతుకుట నీ
చల్లదనంబునఁ గాదే, కల్లోలవతీమతల్లి గంగా తల్లీ. 50

క. పువ్వారుబోఁడి వై సరి, యెవ్వా రన భీష్ముఁ గాంచి యిం పొందితి వీ
వవ్వావి యెఱుఁగుదువె మా, యవ్వా పోషింపఁ బాడి యగు నను నీకున్. 51

చ. సకలశుభంబు లి మ్మనుచు సన్నుతు లీగతిఁ జేయ నాస్రవం
తిక దయఁ దెల్పఁ బంచినగతిం జనుదెంచె నుదంచ దూర్మికా
నికర విలోల ఖేల దళినీ కలగాన లసత్ప్రఫుల్ల హ
ల్లక సుఖడోలికా విహృతి లాలస బాలసమీర మయ్యెడన్. 52

క. చనుదెంచిన హా యని య, జ్జననాయకుఁ డలరుచు న్విశారదుఁ గని యీ
యనుకూలమారుతాగతి, గనఁగనఁ నామోదసూచకం బైనది గా. 53

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. తల నీగంగాతీర్థము, చిలికినవాఁ డీశ్వరుండు చేరెఁడులోఁ గోఁ
గలిగినఁ దరఁగలఁ దేలం, గలిగినఁ దన్మహిమ లెన్నఁగాఁ దర మగునే. 54

క. మునుకలు గంగానదిలో, నొనరించుటకన్న భాగ్య మున్నదె యనుచు
న్మను కలుగంగా దిగి పరి, జనములు కైలా గొసంగ స్నానోన్ముఖుఁ డై. 55

క. తమి నిగుడ గుడాకేశుం, డమరనదీ విమలవారి నాడుచు నుండన్
యమునానదిఁ గూడిన తో, యము నా నది తనరెఁ దత్కచామేచక మై. 56

ఉ. దానము లెన్నియే నచటి తైర్థికభూసుర సంఘ మెల్ల డెం
దాన ముదంబు చెందఁగ నొనర్చి దృఢవ్రతచర్య నిత్యముం
దానము చేయుచున్ హరికథాశ్రవణం బొనరించు చుండె నం
దానముచిద్విషత్తనయుఁ డాశ్రితకల్పమహీరుహం బనన్. 57

క. భోగవతినుండి యెప్పుడు, భాగీరథికడకు వచ్చి భాసిలు మున్నే
నాగకుమారిక యుర్యోల, నాగ యులూపి తమి నొక్కనాఁ డటఁ జెంతన్. 58

ఆ. హిమరసైకసైకతమునందు విహరించు, కైరవేషువేషు ఘననిభాంగు
ననరుదవుల దవులనే చూచి క్రీడి గా, నెటేఁగి యారయార గేందువదన. 59

క. మును ద్రౌపదీస్వయంవర, మున కేఁగినకామరూపభోగులనలన
న్వని యున్నకతనఁ దమకము, మనమునఁ బెనఁగొనఁగఁ జేరి మాయాన్విత యై. 60

ఉ. గుట్టసియాడ గబ్బిచనుగుట్టలపైఁ బులకాంకురావళుల్
తెట్టువ గట్టఁ గోరికలు దేటలు వెట్టఁట వేడుక ల్మది
న్దొట్టికొనంగ నచ్చెరువు తొంగలిఱెప్పల వీఁగ నొత్తఁగాఁ
బెట్టిన దండ దీయక విభీతమృగేక్షణ చూచె నాతనిన్. 61

క. ఏణాక్షి నపుడు వెడసిం, గాణిం గొని యలరుఁదూపుగమిఁ జక్కరయే
ఖాణముగాఁ గలిగినకం, ఖాణపుదొర పింజపింజ గాడఁగ నేసెన్. 62

ఉ. పైపయిఁ గౌతుకంబు దయివాఱి యిటుండఁగ నంత మజ్జనం
బై పువుఁజప్పరమ్మున నొయారముగాఁ గయిసేసి దానలీ
లాపరతంత్రుఁ డై కలకల న్నగుచుండెడిసవ్యసాచి నిం
ద్రోపలరోచిఁ జూచి తలయూఁచి †యులూచి రసోచితంబుగన్. 63

క. సిగ సంపెఁగపూ లొసపరి, వగ కస్తూరినామ మొలపు వలెవా టౌరా
సొగ సిటు లుండఁగవలె నని, సొగసి లతాతన్వి యతనిసొగసు నుతించెన్. 64

క. రాకొమరునెఱులు నీలపు, రాకొమరు నిరాకరించు రాకాచంద్రున్
రాకొట్టు మొగము కెంజిగు, రాకఁ గని పరాకు సేయు నార పదంబుల్. 65

† 'ఉలూపి' యని పాఠాంతరము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. తీరిచినట్టు లున్నవి గదే కనుబొమ్మలు కన్ను లంటిమా
చేరలఁ గొల్వఁగావలయుఁ జేతులయందముఁ జెప్ప గిప్ప రా
దూరులు మల్చివేసినటు లున్నవి బాపురె బొమ్మలోనిసిం
గారము శేషుఁడే పొగడఁగావలె నీతనిరూపరేఖలన్. 66

క. అకటా నన్నితఁ డేలిన, నొకటా నచ్చికము లేక యుండఁగ వచ్చు
న్నికటామృతధారలు మరు, ని కటారి మెఱుంగు లీతనికటాక్షంబుల్. 67

ఉ. ఆ దరహాసచంద్రికలయందము నాప్తులమీఁదఁ జిల్కున
త్యాదరశీతలేక్షణసుధారసధారయుఁ జూడఁజూడ నా
హ్లాదము గొల్పఁగాఁ గలకలామహిమంబుఁ దలంచి చూచిన
న్నాదిరి సేయవచ్చు జననాథుమొగంబును జంద్రబింబమున్. 68

ఉ. ఊఁదుకపోవు శంఖము నహో గళరేఖ శరాసనంబుల
న్వాదుకుఁ బట్టి కన్బొమలవైఖరి ఐంకలు దీరుచుం గటా
క్షోదయలీల సాయకసమూహముల న్విషమాస్త్రుఁ గెల్చుఁ బో
ఱేదొరసాటి యీనరున కెన్నఁగ వీరవిలాససంపదన్. 69

ఉ. కమ్మనిజాళువా నొరయఁ గల్గిన చెక్కులపెక్కువాఁడు చొ
క్కమ్మగుజాతికెంపు వెలగాఁ గొనుమోవి మెఱుంగువాఁడు స
త్యమ్మగురూపసంపద ధనాధిపసూనుని ధిక్కరించినాఁ
డమ్మక చెల్ల నాహృదయ మమ్మక చెల్లదు వీని కియ్యెడన్. 70

సీ. ముద్దాడవలదె యీ మోహనాఁగునిమోము, గండచక్కెరమోవి గలఫలంబు
రమియింపవలదె యీ రమణుపేరురముపై, వలిగుబ్బపాలిండ్లు గలఫలంబు
శయనింపవలదె యీ ప్రియునిసందిటిలోనఁ, గప్పువెన్నెతికొప్పు గలఫలంబు
వసియింపవలదె యీ రసికునంకమునందుఁ, జెలువంపుజఘనంబు గలఫలంబు
తే. రాజసము తేజరిల్లు నీరాజుఁ గూడి, యింపు సొంపులు వెలయఁ గ్రీడింపవలదె
నాకలోకంబువారల కైన లేని, యలఘుతరభోగభాగ్యముల్ గలఫలంబు. 71

క. అని యిటు లువ్విళ్లూరెడు, మనమునఁ గొనియాడి యంత మాపటివేళం
గనుఁ బ్రామి చొక్కుఁ జల్లిన, యనువున నందఱు వితాకులై యుండంగన్. 72

చ. ఇటు జపియించిన న్విడుతునే నిను నే నిఁక నంచు జాహ్నవీ
తటమున సంధ్య వార్చి జప తత్పరుఁడై తగువాని యామినీ
విట కులశేఖరుం గొనుచు వే పురికిం జని నిల్చె నట్టె యా
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
న్నటులనె మాయ యచ్చుపడ నల్లభుజంగి నిజాంగణంబునన్. 73

క. నిలిపిన జప మెప్పటిపలెఁ, జలిపినవాఁ డగుచుఁ బాకశాసని యంతం
దళుకుంబిసాళివాలుం, జెలిగన్నులు విచ్చి చూచె నివ్వెఱతోడన్. 74

సీ. దట్టంపుఁజెలిపిటి తరఁగచా ల్కడ కొత్తి, నెలతాలజగతిఁ దా నిలుచు టేమి
కొలఁకుఁదామరగందములఁ గ్రిందఁ బడవైచి, కపురంపుఁదావిఁ దాఁ గవియు టేమి
చివురుజొంపపుమావిజీబు మాయము సేసి, పసిఁడియుప్పరిగఁ దాఁ బ్రబలు టేమి
నిద్దంపుటిసుముతిన్నియపాన్పు దిగఁద్రావి, యలరులపాన్పుఁ దా వత్తు టేమి

తే. మసమసకసంజకెంజాయ మఱుఁగువెట్టి
మిసిమికెంపులకాంతిఁ దా మెఱయు టేమి
మొదల నే గంగతటి నున్నయదియు లేదొ
మాయయో కాక యిది యంచు మరలి చూడ. 75

సీ. బెళుకుఁగాటుకకంటిసొలపుఁజూ పెదలోనఁ, బట్టియుండెడిప్రేమఁ బట్టి యీడ్వఁ
జికిలిబంగరుద్రాఁతి జిలుగుటొయ్యారంపుఁ, బైఁట గుబ్బలగుట్టు బైఁటవేయ
సొగసుఁగుచ్చెలనీటు వగలు కన్నులపండు, గలుగ మాయపుఁగౌనుఁ గలుగఁజేయ
నిడుదసోగమెఱుంగుజడకుచ్చు గరువంపుఁ, బిఱుఁదురేఖకు గెల్పుబిరుదుచాటఁ

తే. గంటుసరి నంటుకస్తురికమ్మవలపు, కప్పురపువీడియపుఁదావి గలసి మెఱఁగ
నొఱపులకు నెల్ల నొజ్జయై యుండె నపుడు, భుజగగజగామినిమిటారిపాలుపుమీరి.

క. అటు లున్నకొమవుఁ బ్రాయపుఁ, గుటిలాలకఁ జూచి మదన గుంభిత మాయా
నటనంబో యది గంగా, ఘటనంబో యని విచారఘటనాళయుఁ డై. 77

ఉ. తియ్యనివింటివాని వెను తియ్యక డగ్గఱఁ జాలు న య్యసా
హాయ్యతనూవిలాసి దరహాసము మీసముఁ దీర్ప నప్పు డా
తొయ్యలిపంకఁ గన్గొని వధూమణి యెవ్వరిదాన వీపు పే
రెయ్యది నీకు నొంటి వసియింపఁగఁ గారణ మేమి నావుడున్. 78

ఉ. మేలిపసిండిగాజులసమేళపుఁబచ్చలకీల్కడెంపు డా
కేలు మెఱుంగుగబ్బిచనుఁ గ్రేవకుఁ దార్చుచు సోగకన్నులం
దేలఁగఁ జూచి యోమదనతీవవమన్మథ యీజగంబు పా
తాళము నే నులూపి యను దాన భుజంగమరాజకన్యకన్. 79

క. సరి లేనివిలాసము గని, వరియిం చిటఁ దోడికొనుచు వచ్చితి ని న్నో
కురువీర వసింపఁగ నీ, కుఱు వీర దృఢాఁకపాలిఁ గోరినదానన్. 80

ఉ. వం పెసఁగన్ గటాక్షలవమాత్రముచేతనె ముజ్జగంబు మో
హింపఁగఁ జయభారి మీఁక నీవు సహించితి గానఁ గెలిచి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చంపకగంధి బిత్తరపుఁజన్నులమీఁద సుఖించుచుండు నా
సంపెఁగమొగ్గ ముల్కఁగడ సామరి సోమరి గాక యుండునే. 81

క. అనుచచ్చెలివాక్యంబులు, విని యచ్చెరు వొంది రూప విభ్రమ రేఖా
ఖను లెందు నాగకన్యలె, యని విందుము నేఁడు నిక్క మయ్యెన్ జూడన్.

క. అన్నన్న మొగము వెన్నుని, యన్నన్న జయించుఁ గన్ను లన్న న్నలినా
సన్నములు నడుము మిక్కిలి, సన్నము మాటలు సుధాప్రసన్నము లెన్నన్.

ఆ. నవ్వుఁబువ్వు నవ్వు జవ్వనినాసిక, చివురుసవురు జవురు నువిదమోవి
మబ్బునుబ్బు గెబ్బు బిబ్బోకవతివేణి, మెఱపునొఱపు బఱపుఁ దెఱవమేను.

క. రవరవలు నెఱపు నీలపు, రవ రవణముతోడఁ జెలి యరాళ కచంబుల్
కవకవ నవ్వున్ వలి జక్కవకవఁ గలకంఠకంఠి కఠినకుచంబుల్.

ఉ. చెక్కులయందముల్ మొగముచెల్వముఁ జన్గవనీటు వేణితీ
రెక్కుడఁ జూడ నన్నిటికి నెక్కువ దే మన సైకతంబుతో
నెక్కటికయ్యముల్ సలుపునిక్కటి యొక్కటి చాలదే మఱం
డక్కఁగొనన్ రతిం గెలిచి డక్కఁగొన న్నవమోహనాంగికిన్.

చ. అని మది మెచ్చి యొచ్చె మొకయంచను లేనిమనోహరాంగముల్
గనుఁగొని యానె కా వ్రతము గైకొని యుండెడినన్ను నేల దో
డ్కొని యిటఁ దెచ్చె నీ వెడఁగుఁగోమలి భూజగ మేడ మానుతా
శనజగ మేడ నెంత ఘన సాహస మింతుల కంచు నెంచుచున్.

క. కాముకుఁడఁ గాక వ్రతి నై, భూమిప్రదక్షిణము సేయఁ బోయెడివానిం
గామించి తోడి తేఁ దగ, వా మగువ వివేక మించు కైనన్ వలదా.

ఉ. నావుడు మోమునన్ మొలకనవ్వొలయన్ వలిగబ్బిగుబ్బచన్
దీవికిఁ గాన టించుక నటించుకవున్ గనిపింపఁ బల్కె రా
జీవదళాక్షి యో రసికశేఖర యో జనరంజ నైక లీ
లావహ రూప యో నుత గుణా తగునా యిటు లాన తీయఁగన్.

క. నిను గీతిసాహితీమో, హనవాణులు చెవులు పట్టి యాడింపంగాఁ
గఁ యుండి కాముకుఁడఁ గా, నని పల్కిన నాకు వచ్చి కానె నృపాలా.

క. అతులిత విలాస రేఖా, కృతులన్ వలపించి యిటులఁ ద్రిభువనలీలా
వతుల నలయించు చేనా, వ్రత మనఁగా నీకు రూప వంచితమదనా.

చ. తెలియనిదానఁ గాను జగతీవర ద్రౌపదియందు ముందు మీ
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
రలసమయంబు సేయుట ద్విజార్థము ధర్మజుపాన్పుటింటిముం

గలఁ జని శస్త్రశాల విలు గైకొను టందునిమిత్త మీవు ని
శ్చలమతి భూప్రదక్షిణము సల్పఁగ నెచ్చట నే నెఱుంగుదున్. 92

తే. చెఱకువిలుకానిబారికి వెఱచి నీవు, మఱుఁగుఁ జేరితిఁ జేపట్టి మనుపు నన్నుఁ
బ్రాణదానంబుకన్నను వ్రతము గలదె, యెఱుఁగవే ధర్మపరుఁడవు నృపకుమార.

ఉ. నాయమె నీకు మేల్పడిననాతి నలంచుట యంత్రమత్స్యమున్
మాయఁగఁ జేసి మున్ ద్రుపదనందన నేలవె యంగభూపతా
కాయతయంత్రమత్స్య మిపు డల్లనఁ ద్రెళ్ళఁగ నేసి యేలుకో
తీయఁగఁ బంచదార వెను తీయఁగఁ బల్కు నమున్ ద్వితీయఁగన్. 94

క. అనుడు నుడురాజకులపా, వనుఁడు సమస్తమ్ము నెఱుఁగువలఁతివి గద యా
యనుచితము దగునె పరసతి, నెనయుట రాజులకు ధర్మమే యహిమహిళా. 95

చ. అన విని పాఁపపూపజవరా లెదలో పల పాఁప లేక యా
తని తెలిముద్దు నెమ్మొగముఁ దప్పక తేటమిటారి కల్కిచూ
పునఁ దనివారఁ జూచి నృపపుంగవ యన్నిట జాణ వూరకే
యనవల సంటిగా కెఱుఁగవా యొకమాటనె మర్మకర్మముల్. 96

ఉ. కన్నియఁ గాని వేఱొకతెఁ గాను మనోహరరూప నీకు నే
జన్నియ పట్టి యుంటి నెలజవ్వన మంతయు నేఁటిదాఁక నా
కన్నులయాన నా వలపుఁగస్తురినామము తోడు నమ్ము కా
దన్నను నీదుమోవి మధురామృత మానిట బాస సేసెదన్. 97

చ. ఇలపయి మత్స్యయంత్ర మొకరేటున నేసి సమస్తరాజులన్
గెలిచినమేలువార్త లురగీపరగీతిక లుగ్గడింప వీ
నుల నవి చల్లఁగా విని నినున్ వరియింప మనంబు గల్గి నీ
చెలువము వ్రాసి చూతు నదె చిత్తరువందు ననేకలీలలన్. 98

ఉ. చెప్పెడి దేమి నావలపు చేసినచేతలు కొల్వులోన ని
న్నెప్పుడు గంటి నప్పుడ పయిం బడ నీడిచె నిల్వఁ బడ్డపా
టప్పుడ టెంత యైనఁ గల దట్టిహాళాహళి కింతసేపు నీ
వొప్పెడిదాఁకఁ దాళుట కయో మది మెచ్చవుగా నృపాలకా. 99

తే. అనిన ఫణిజాతి వీ వేను మనుజజాతి
నన్యజాతిఁ బ్రవర్తించు టర్హమగునె
యేల యీకోర్కి యనిన రాచూలి కనియెఁ
జిలువచెలువంపుఁబల్కులఁ జిలువచెలువ. 100

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

4

ఉ. ఏ మనఁ బోయెదం దగుల మెంచక నీ విటు లాడఁ దొల్లి శ్రీ
రాముకుమారుఁ డైనకుశరాజు వరింపఁడె మా కుముద్వతిన్
గోమలచారుమూర్తి పురుకుత్సుఁడు నర్మదఁ బెండ్లియాడఁడే
నీమన సొక్కటే కరఁగ నేరదు గాని నృపాలకాగ్రణీ. 101

ఉ. ఈ కలహంసయాన నను నెక్కడి కెక్కడినుండి తెచ్చె నా
హా కడుదూర మిప్పు డని యక్కునఁ జేర్పక జంపుమాటలన్
వ్యాకులపెట్టు టేల విరహాంబుధి ముంపక పోదు నన్ జలం
బే కద నీకు మంచి దిఁక నీఁతకు మిక్కిలి లోఁతు గల్గునే. 102

చ. అని వచియించునప్పుడు ముఖాబ్జము నంటెడివిన్నఁబాటు చ
క్కని తెలిసోగకన్నుఁగవఁ గ్రమ్ముచు నుండెడిబాష్పము ల్గళం
బునఁ గనిపించుగద్గదిక ముప్పిరి గొన్నవలవంతఁ దెల్ప ని
ట్లను మదిలోఁ గరంగి రసికాగ్రణి యాకరభోరుబోరునన్. 103

ఉ. చక్కెరబొమ్మ నా వ్రతముచందముఁ దెల్పితి నంతె కాక నీ
చక్కఁదనంబుఁ గన్న నిముసం బయిన న్నిలు పోప శక్యమే
యక్కునఁ జేర్ప కంచు దయ నానతి యీఁ దల వంచె నంతలో
నెక్కడనుండి వచ్చెఁ దరళేక్షణకు న్ననుసిగ్గుదొంతరల్. 104

ఉ. అంకి లెఱింగి యాసరసుఁ డంత వివాహవిధిజ్ఞుఁ డైనమీ
నాంకుఁ డొనర్చినాఁ డిది శుభైకముహూర్తము ర మ్మటంచుఁ బ
ర్యంకముఁ మీఁద నచ్చెలిఁ గరగ్రహణం బొనరించెఁ దన్మణీ
కంకణ కింకిణీగణ వికస్వర సుస్వరము ల్సెలంగఁగన్. 105

మ. ఒకమాణిక్యపుబొమ్మ యెట్టివగకీలో జాళువా జాలవ
ల్లిక బాగాల్ కపురంపుటాకుమడుపుల్ వే తెచ్చి రా జున్నచా
యకు నందీయ నతండు లేనగవుతో నావేళ నావ్యాళిక
న్యక కెంగేల నొసంగి కైకొనియె సయ్యాటంబు వాటిల్లఁగన్. 106

ఉ. శయ్యకుఁ దార్పఁగాఁ దుఱుముజాఱెఁ దనంతటఁ జక్కఁదిద్దఁ బోఁ
బయ్యెద జాఱె నయ్యదిరిపాటునఁ గ్రక్కున నీవి జాఱె రా
జయ్యెడ నవ్విలాసినియొయారముఁ జూచిఁ కవుంగిలించె నా
నెయ్యెడ మేలె చూతురు గ్రహింపరు జాణలు, జాఱుపాటులన్. 107

ఉ. కౌఁగిటఁ జేర్చునప్పటిసుఖంబె లతాంగికిఁ బారవశ్యమున్
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
మూఁగఁగఁ జేసె. మోవిపలునొక్కు లురోజ నఖాంకముల్ మొదల్

గాఁగలకంతుకేళిసుఖలక్షణముల్ పయిపెచ్చు లయ్యె న
ట్లాఁగద యెట్టివారలకు నగ్గలపుందమి గల్గి యుండినన్. 108

చ. చనుఁగవ సాముకండెపుఁబిసాళి యురంబున సారెఁ గాననే
మన సునుపున్ సుధారసము మాటికిఁ గ్రోలనె చూచుఁ జొక్కు గీ
ల్కొను సరసోక్తుల న్వినని కోరు సదా యిటు లాదిసంగమం
బున నె విభుండు మూఁడువలపుల్ వెలచెన్ ఫణిరాజకన్యకన్. 109

తే. నాగరికముద్ర గలమంచిబాగరి యఁట, నాగవాసములో వింతె నటనలదఁట
కులుకుసుబ్బలప్రాయంపుఁగోమలి యఁట, వలచి వలపింపదే యెంతవారి నైన. 110

క. ఈగతి రతికేళీసుఖ, సాగరమునఁ దేలియున్న సమయంబునఁ ద
ద్యోగం బెటువంటిదొ స, ద్యోగర్భంబున సుపుత్త్రుఁ డొకఁ డుదయించెన్. 111

క. ఆచక్కనిబాలుఁడు వా, క్ప్రాచుర్యముఁ గాంచు నని శుభగ్రహదృష్టుల్
చూచి యిలావంతుం డని, యాచతురుఁడు నామకరణ మలరిచియంతన్. 112

ఉ. కామినిఁ జూచి రమ్ము గజగామిని యిక్కడ నొక్కనాఁ డిఁకం
దామస మైన నక్కడ హితవ్రతి వైదికకోటి యాత్మలో
నే మని యెంచునో యిపుడ రేఁగవలెన్ దరువాత నీసుత
ప్రామణి నీవు వచ్చెదరు గాకని యూరడిలంగఁ బల్కినన్. 113

ఉ. అంటినప్రేమ జాహ్నవికి నప్పుడ తోడ్కొని వచ్చి యల్ల వా
ల్గంటి నిజేశ్వరుం దనదుగబ్బి చనుంగవఁ జేర్చి బాష్పముల్
కంటఁ దొరంగుచుండఁ దిరుగం దిరుగం గనుఁగొంచుఁ గ్రమ్మఱన్
జంట దొఱంగి సంజను వెసం జను జక్కవపెంటియుంబలెన్. 114

ఉ. అంతట రాజురాకఁ గనియాప్తపురోహితభృత్యవర్గ మ
త్యంత ముదమ్ము చెంది యిటు లాస్తలఁ గాచుట కేమొ గాక యే
కాంతము గాఁగ నేఁగుదురె యంచుఁ దలంచితి మీరు వచ్చువ
ర్యంతము మమ్ము మే మెఱుఁగ మందఱప్రాణము లీవ భూవరా. 115

చ. అని పలుకం బ్రసన్నముఖుఁ డై విభుఁ డిష్టసఖు న్విశారదుం
గని యొకవింత వింటె ఫణికన్య యులూపి యనంగ నోర్తు న
న్గొని తమనాగలోకమునకుం జని తన్ను రమించు మంచుఁ జె
ప్పని ప్రియ మెల్లఁ జెప్పి యొడఁబా టొనరించి కరంచె డెందమున్. 116

ఉ. చెప్పెడి దేమి కన్నుఁగవ చేరల కెక్కుడు చంద్రబింబమే
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
తప్పదు మోము మోవి సవతా చివు రెక్కుడిమాట గొప్పకుం

గొప్పపిఱుందు గబ్బిచనుగుబ్బలు కౌఁగిటి కెచ్చు జాళువా
యొప్పులకుప్ప మేను నడు మున్నదొ లేదొ యెఱుంగ నింతకున్. ॥

ఉ. చెంగున దాఁటుఁజూపు లిరుచక్కని చేడిస లేమొ మీటినన్
గ్రంగన వాఁగుగుబ్బలు చొకారపుఁదాళము లేమొ రూప మా
నం గన నైనచెక్కిళులు నాణెపుటద్దము లేమొ చొక్క మా
రంగున మీఱుదానియధరంబును గెంపగు నేమొ నెచ్చెలీ. ॥

ఉ. ఆయెలనాగవేణి మెఱుఁగారుకటారికి మాసటీఁ డగున్
బో యన వచ్చు నమ్మెఱుఁగుఁబోఁడి పిఱుందు సమస్త భూమికిన్
రాయ లనంగ వచ్చు నలరాజనిభాస్యయెలుంగు గట్టివా
కోయిలకంచుకుత్తికలకున్ బయకాఁ డనవచ్చు నెచ్చెలీ. ॥

క. మదిరాక్షి మోవిజిగి ప్రతి, పదనము గావించుఁ గీరపదనముతోడన్
మదనునివిలు గొనవచ్చున్, సుదతీమణికన్నుబొమలసుదతీ రెంచన్. ॥

చ. అలజడయందము న్మెఱుఁగుటారుమిటారము నాకు ముంచుగాఁ
జిలువకొలం బటంచుఁ జెలి చెప్పక తొల్తనె చెప్పుఁ దత్తనూ
విలసన మెన్నఁ గన్నదియు విన్నది గా దిలలో లతాంగు ల
ప్పాలఁతుకకాలిగోరులకుఁ బోలరు పోలునొ రేమొ తారకల్. ॥

సీ. మరునిగెల్పులకథామహిమమ్ము విలసిల్లు, నొఱపుజిత్తరుకీవి నుల్లసిల్లు
వీనుల కమృతంపుసోన లై వర్తిల్లు, శారికాముఖసూక్తి సందడిల్లుఁ
గస్తూరికాదిసువస్తులఁ బ్రభవిల్లు, పరిమళమ్ములజోకఁ బరిఢవిల్లుఁ
జెప్పఁ జూపఁగ రానిసింగారము ఘటిల్లు, పెక్కుశయ్యలసొంపు పిక్కటిల్లు

తే. వింతహరువులపనులచే విస్తరిల్లు, దివ్యమానిక్యకాంతులఁ దేజరిల్లు
నందముల కెల్ల నందమై యతిశయిల్లుఁ, బాఁపజవరాలిబంగాఁరుఁబడకటిల్లు. ॥

క. ఆ భోగము తద్వస్తు చ, యాభోగము నెందుఁ గన్నయవి గావు సుమీ
నాభోగపురము సరి యా, నా భోగవతీపురంబు సార్థం బయ్యెన్. ॥

ఉ. ఆమదిరాక్షి భోగవతి యన్నదిఁ గ్రుంకఁగఁ జేసి తత్పుర
స్థేముని హాటకేశ్వరు భజింప నొనర్చుటు తోడి తెచ్చిన
న్నీ మహి నిల్పి రేఁగ నిదె యిప్పుడె నన్నెడఁ బాయ లేనియా
ప్రేమ మ దింత యంత యని పేర్కొనరా దని తెల్పెఁ దెల్పినన్. ॥

ఉ. మాఖరి మించ నిట్లు లను మంత్రిశిఖామణి చోద్య మయ్యె నా
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
వైఖరి విన్న నే మనఁగ వచ్చు నహో మనుజేంద్రచంద్రమ

శ్శేఖర చిల్వరాకారము చేడియ నొక్కటేఁ జెప్ప నేల ని
రేఖఁ గనుంగొన న్వలవరే ఖచరీ ముఖ సుందరీ మణుల్. 125

క. అని పలుక నలరి బలరిపు, లనయుం డటఁ గదలి మొదలి తైర్థికులును దా
నును మంచుఁగొండ యండకుఁ, జని తచ్ఛిఖ రావలోక జనితాదరుఁ డై. 126

సీ. పదియాఱునెన్మి గుబ్బలిరాచకూఁతురు, పట్టంపురాణిగాఁ బరఁగుజాణ
పతియర్ధదేహంబు సతి యంట నిజముగాఁ, బ్రబలు కన్నియఁ గన్నభాగ్యశాలి
ముజ్జగమ్ముఁ బవిత్రముగఁ జేయుతీర్థమ్ముఁ, గొనసాగఁ జేసినయనఘమూర్తి
భూమిధరారాతిచే మొక్కవోవని, యరిదిబిడ్డనిఁ గాంచి నట్టిమేటి

తే. యోషధుల మొలపించినయుత్తముండు
చల్లఁ దనముల కెల్ల దీక్షాగురుండు
సకలమాణిక్యరాశికి జననసీమ
యీనగస్వామి సద్గుణాస్థానభూమి. 127

వ. అని బహుప్రకారమ్ముల హిమగిరిప్రభావము వక్కాణించి తత్ప్రదేశంబున శాఖా
శిఖోల్లిఖితగ్లావృక్షం బగునగస్త్యవటవృక్షంబుఁ గనుంగొని, యచట నికటవిలం
కటకటకకమనీమణిశృంగం బగుమణిశృంగంబు గని యగణ్యపుణ్యాగమసమర్థం
బగుహిరణ్యబిందుతీర్థమ్మునఁ గృతావగాహుం డై గోహిరణ్యధరణ్యాదిదానమ్ము లనే
కంబులు గావించి, ప్రాగ్భాగమునఁ గలికలితనరశరణ్యం బగునైమిశారణ్యంబు
సొచ్చి, యచటం గోటిగుణితాంగీకృతానతజనతాసమర్పితనారాయణుం డగుబదరీ
నారాయణుం బూజించి, మనీషిమనీషితఫలప్రదానశుచిప్రయాగం బగుప్రయా
గంబున కేఁగి, ముముక్షుజనహృదయంగమం బగుత్రివేణీసంగమంబునఁ దానం
బులుం దానంబులు గావించి, యచ్చట మాధవు నారాధించి, భవరసానుభవ
భీరుసానుక్రోశం బగుపంచక్రోశంబుఁ బ్రవేశించి, యభ్యర్ణమణికర్ణ యగుమణిక
ర్ణికం గ్రుంకి, యన్నపూర్ణవిశాలాక్షీసనాథుఁ గాశీవిశ్వనాథుం దర్శించి, తైర్థిక
సమాహితసమ్యగయకు గయకుం జని, యచట నుచితకృత్యంబులు నిర్వర్తించి, పురు
షోత్తమక్షేత్రంబునకుం జని, యింద్రద్యుమ్నసరస్సున శిరస్స్నమజ్జనం బై నమజ్జన
దృక్చకోరజ్యోత్స్నాధుని జగన్నాథునిఁ గొలిచి, యాతల గౌతమీతటినీతోయ
స్నాతుం డై జగన్మోహనమనోజవశీకరణకారణకళాప్రావీణ్యలావణ్యహావభావప్రక
టనటనరేఖా శ్లాఘాదూరీకృతరంభోర్వశీరంభోర్వశీశేకిరణకిరణనిభవిభా రంగన్మణి
రంగమంటపోజ్జ్వలాసికాకృతలక్షణ లాసికా కృతలక్షణకటాక్షవీక్షణసుధారస
ధారా సేచనకాసేచితా సేచనకాంగుం డై, పాపాటవీవిపాటనపాటవసనూచన
దీక్షారామపరమేశ్వరుం డగుద్రాక్షారామభీమేశ్వరుం జేరి జోహారులు నుపహారం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బులు సమర్పించి, సంతతానంతకాంతిరంహం డగునంతర్వేది నృసింహు సేవిం
యందు భవసాగరతరణి యగుసాగరసంగమంబునఁ దీర్థం బాడి కృష్ణవేణ్యాదిపు
ణ్యతరంగిణుల మునింగి, యుత్తుంగశృంగవిలోకిలోకసాత్కృతసుపర్వపర్వ
బగుశ్రీపర్వతంబు లోచనపర్వంబు గాఁజూచి ప్రణమిల్లి,మల్లికార్జునుసమ్మోదమున
బ్రణుతించి తన్మనోజ్ఞభ్రమరీవిభ్రమరమ్య యగుభ్రమరాంబం బ్రశంసించి, భక్త
శోభనపరంపరాసంపాదకపాదకమలరజోలేశు నహోబలేశు భజించి, నిజభజ
రతజనప్రతిపాదితానశ్వరపదంబు లగుశ్రీవేంకటేశ్వరపదంబులకు నమస్కృతుల
విస్తరించి, దుస్తరాంహస్తూలికాసందోహదావహదోహళనిజాహ్వాయస్మరణవిశు
లింగం బగుశ్రీకాళహస్తిలింగంబు నంతరంగంబున హర్షతరంగంబు లుప్పొంగ
గాంచి, కాంచీపురంబున కరిగి, కరిగిరీశ్వరుం డై విరాజిలువరదరాజుల నప్రజ
కప్రఫలదాయకు నేకామ్రనాయకుం బూజించి, యవులఁ గావేరికాంతరితకా
తాంతరీపంబునప్రసన్నరూపంబునం బాటిల్లుకోటిహరిత్తురంగధాముని రంగధా
నిసేవించి, కుంభఘోణచంపకారణ్యాదిపుణ్యక్షేత్రమ్ము లీక్షించి దక్షిణసరాకరసి
కానికరతుందిలమందానిలస్పందనాతిశీతలసికతాతలవిహితయాతాయాత నిరస్త
పథికనికాయకాయమానాయమానలవలైలావల్లీవేల్లితక్రముకప్రముఖాఖిల శా
శాఖాశిఖాలతాంతరకుహరవిహరమాణవివిధగరుద్రథకులకలకలోద్వేలవేలామనో
జ్ఞమార్గంబున నపసర్గరమేశ్వరం బగురామేశ్వరంబునకుం బోయి, సేతుసందర్శన
బొనర్చి, విధూతస్నాతృపంచజనవృజినజనుష్కోటి యగుధనుష్కోటిం గృ
స్నానుం డై, పాండునూనుం డందులం దులాపురుషాదిమహాదానంబు లాచరిం
రఘువీరభూభుజభుజాదర్పదర్పణం బగురామాయణంబు పారాయణంబు చేసి
భూసురాశీర్వాదసంపదలం బొదలి, యచ్చోటుఁ గదలి,పదుమూఁడవనెలఁబాండ్య
మహీమండలాఖండలుం డగుమలయధ్వజుం డేలుమణిపురంబుఁ జేరం బోవు స
యంబున. 1

సీ. మంగళస్నానసంభ్రమముఁ దెల్పెడిరీతిఁ, గొలనఁ గెందామరకొలన, దేలి
ధవళముల్ విని చొక్కుహావణుఁ దెల్పెడులీల, హాళిఁ గోయిలపల్కు లాలకిం
తలఁబ్రాలు వోయుచి త్తరముఁ దెల్పెడుచాయఁ, గ్రొన్నన ల్దోయిళ్లఁ గొలఁది నొస
బువ్వానభుజియించుపొల్పుఁ దెల్పెడిజాడ, గుమిఁ గూడికొనిమరందములు గ్రో

తే. తనకుఁ దోడ్తోడ నగుపెండ్లిఁ గనఁబడంగఁ
జేయునటువలె గారాబుఁజెలులఁ గూడి
వనవిహారంబు గావించి గనెడుపొండ్య
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
రాజసుతఁ జూచి యాపాండురాజసుతుఁడు. 1

తే. ఈ వెలందియొడల్ పైఁడిలో వెలంది, యీనెలంతలలాటంబు లేనెలంత
యీసుపాణిరదశ్రేణియే సుపాణి, యీబిడారు మృగమదశ్రీబిడారు. 130

క. వాతెఱను నమృతమే తుల, మేతులకింపులపిసాళి మిసిమికిఁ గ్రొమ్మిం
చే తుల చేతుల కబ్జము, లే తుల లేతులవెలందు లీచెలి తులరే. 131

క. కన్నెనగుమోముతోడం, బున్నమచందురునిసాటిఁ బోలుపవచ్చు
న్నెన్నుదురుతోడ మార్కొని, ము న్నందఱుఁ జూడ రేక మోసక యున్నన్.

క. కమలముల నుజ్జగించుం, గుముదంబుల బుజ్జగించుఁ గొమచూపులు పు
న్నమచందమామవెలుఁగుల, కొమ రంతయుఁ బుణికి పుచ్చుకొనఁ బోలుఁ జుమీ.

శా. చెండ్లా గుబ్బలు జాళువాతళుకులా చెక్కిళ్లడాల్ సింగిణీ
విండ్లా కన్బొమ లింద్రనీలమణులా వేణీరుచుల్ తమ్మిలేఁ
దూండ్లా బాహువు లింతచక్కఁదన మెందుం గాన మీజవ్వనిం
బెండ్లాడం గలవాఁడు చేసినది సుమ్మీ భాగ్య మూహింపఁగన్. 134

మ. అని కన్గొంటె విశారదా యనిన నాహా యే మనన్వచ్చు నో
జననాథాగ్రణి యీవినూతనతనూసౌందర్య మీక్షించిన
దనుఁ దా మెచ్చు విధాతచిత్తమున నీతన్వంగితోఁ బోల్పఁగా
నెన లే దెచ్చటఁ జూడమా తుహినభూభృత్సేతుపర్యంతమున్. 135

క. మలయధ్వజబాహుజను, స్తిలకుని గారాబుఁబట్టి చిత్రాంగద పే
రలఘుకులశీలగుణములు, గల దీకన్య యని చెప్పఁగా వింటి నృపా. 136

క. అన విని మనమునఁ గోర్కులు, కొనసాగఁగ నీనృపాలకునితో నెయ్యం
బొనరింపవలయు నేఁడి, వ్వని నుండుద మనుచుఁ జొచ్చి వచ్చుచు నుండన్.

సీ. పద్మరేఖలఁ బోల్పుబాలికాతిలకంబు, చరణంబు లూఁదినతెరువుఁ జూచి
మలయధ్వజతనూజకొలువు సేసినజీవ, దంతపుఁజవికెఁజిత్తరువుఁ జూచి
పొన్నగున్నలనీడఁ గన్నెపుప్పొడితిన్నె, మసని బూజించినహరువుఁ జూచిఁ
కొమ్మ కౌఁగిటఁ జేర్ప గోరంట నంటిన, మొనగుబ్బకస్తూరిమురువుఁ జూచి
తే. యీవనము చేసినదికా యదృష్ట మనుచు, రాజసుతుఁడు చిత్రాంగద మై జవాది
కమ్మతావి గుబాళించుతమ్మికొలని, కెలఁకులకుఁ జేరి యంతంత వలపు మీఱి. 138

మ. తనకుం గౌఁగిలి యీ వొకప్పుడును నాథా నీకరస్పర్శనం
బున గిల్గింతలె యంచుఁ బద్మిని కరాంభోజంబులన్ మందమం
దనటద్వాయుచలద్దళాంగుళులు గన్పట్టంగ నవ్వేళ రా
యని [illegible] 139

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. నా విని హావభావపరిణామవిదుండు విశారదుం డనుక్
దేవరవార లింక నరుదే శకునమ్ములు మంచి వయ్యె వే
రావలె శోభనోత్సవపరంపర లిప్పుడు చూడుఁ డంచు నె
త్తావులదీవు లై తనరు తామరమొగ్గలు రెం డొసంగినన్. 14

తే. అదియు నొకశకునంబు గా నధిపుఁ డంది, చేతి కం దిచ్చినట్లనె చేకుఱంగఁ
గలదు వలిగబ్బిగుబ్బెత చెలిమి యనుచు, నాత్మలో నెంచి యాభావ మపనయించె

చ. నెల యుదయించునప్పు డలనీరజముల్ కుముదంబు లౌను రేల్
గలువల దాయ రాకకుఁ బగల్ కుముదంబులు నీరజంబు లౌఁ
దలఁపఁగ నింతవింత గలదా యని కందువమాటలాడుచుం
బళిర కిరీటి మీఱెఁ దన ప్రౌఢి విశారదుఁ డెన్నుచుండఁగన్. 14

ఉ. అంగజరాజు పాంథనిచయంబులపై విజయం బొనర్ప నేఁ
గంగ దలంచునంత మును గల్గఁగ దాసులు పట్టుజాళువా
బంగరుటాలవట్టములభంగిఁ గనంబడెఁ బూర్వపశ్చిమో
త్తుంగమహీధరాగ్రములఁ దోయజశాత్రవమిత్రబింబముల్. 14

క. ఒకమెట్టు తరణి డిగ్గిన, నొకమెట్టు శశాంకుఁ డెక్కు నుర్వీస్థలిలో
నొకరాజు సన్నగిల్లిన, నొకరా జంతంతకుక్ మహోన్నతిఁ గనఁడే. 14

చ. క్షితిపయి పట్టిమ్రాఁకులు జిగిర్ప వసంతుఁడు దా రసోపగుం
భితపదవాసనల్ నెఱప మెచ్చక చంద్రుఁడు మిన్నునం బ్రస
న్నతయును సౌకుమార్యముఁ గనంబడ జాల్ గరగంగఁ జేసె నే
గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా. 14

చ. వెడవిలుకానికిం జెఱకువిల్లును గల్వలకోరి కోరికల్
గడలుకొనంగ నామనియుఁ గల్వలరాయఁడు నిచ్చి మన్ననం
బడయఁడు వాని కెక్కుడుగ వార్వులు తామును గాన్క తెచ్చె నాఁ
బడిబడి గంధలుబ్ధమధుపంబులు రాఁ జను దెంచెఁ దెమ్మెరల్. 14

చ. ఒకచిగురాకుఁ గొమ్మఁ బిక మొక్క ప్రసూనలతాగ్రసీమఁ దేం
ట్లొకఫలశాఖ రాచిలుకయుక్ రొద సేయఁగ గాడ్పుపొందు వా
యక పయి వెన్నెలల్ వొలయ నామని సొంపుల నింపు జొంప మే
నొకయెలమావిక్రింద మరుఁడో యనఁగా నరుఁ డుండె నయ్యెడన్. 14

క. విధుచకచకలును బుండ్రే,క్షుధనుర్ధరు నంపసెకలు శుకపికశారీ
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
మధులిట్టులు మలయానిల, మధులిట్టులు తనదుధైర్యమహిమఁ గలంపన్. 14

ఉ. చందనగంధి నెన్నుదురు చందురులో సగఁబాల బాలము
ద్దుం దెలిచూపు లంగజునితూపులలోపల మేల్తరంబు లిం
దిందిరవేణి మోవి యెలదేనియలో నికరంబు తేట యే
మందము మందయాన మొగమందము మీఱు నవారవిందమున్. 149

ఉ. బంగరుబొంగరాలపరిపాటి చనుంగవ మీలనూటి త
ళ్కుంగనుదోయి చంద్రుప్రతికోటి మొగం బెలదేఁటిథాటిక
న్నం గడుమేటి వేణి పులినంబులసాటి పిఱుం దయారె చి
త్రాంగదపాటిజోటి గలదా యని మెచ్చుఁ గిరీటి మాటికిన్. 150

క. ఈకరణిఁ దలంచుచు నా, లీకనిభానన నెదన్ నిలిపి రే గడిపెన్
లేకెటుల నిద్ర వచ్చున్, రే కగు నయ్యువిద నెదను నిల్పినదాఁకన్. 151

తే. అపుడు నృపుఁడు ప్రఫుల్లనవాంబుజప్ర, సన్నముఖుఁడయి మలయధ్వజక్షితీశ
కమలహితునకు మామకాగమనవార్తఁ, దెలుపు మనుచు విశారదుఁ బిలిచి పనిచె.

చ. పనిచిన నేఁగి యాతఁడు నృపాలునిమంత్రిముఖాంతరంబునం
గనుఁగొని యంత్రమత్స్యము జగం బెలుగన్ భుజశక్తి నేసి జ
వ్వనిఁ గయికొన్నయర్జునుఁడు వచ్చినవాఁ డిదె తీర్థయాత్రగా
జనవర యంచు విన్నపము సల్ప ససంభ్రమచిత్తుఁడై తగన్. 153

క. తననగరువంటిదే చ, క్కనినగ రొక టాయితంబు గావించి పురం
బు నలంకరింపఁగాఁజే, సినవాఁడై యపుడు సకలసేనలుఁ గొల్వన్. 154

చ. ఎదురుగ వచ్చి పాండ్యధరణీశ్వరుఁ డర్జునుఁ గాంచి నేఁడుగా
సుదినము మీరు రాఁ గలుగుశోభన మెన్నటి కబ్బుఁ బ్రోలికిం
బదుఁ డని యిద్దఱుం దొఱసి భద్రగజంబుల నెక్కి వచ్చి రిం
పొదవ హళాహళిం గడకునెత్తెడు పౌఁజులదిక్కు సూచుచున్. 155

తే. రాజవీథుల నెసఁగ నీరాజనములు, కటికవా రెచ్చరింప నైకటికభూమి
వందిజనములు వొగడఁ జెల్వొంది మిగులఁ, బురముసొత్తెంచె విజయుఁ డబ్బురముగాఁగ.

క. నెట్టుకొని నరునిఁ గనుచోఁ, బట్టణమునఁ గలసమస్తభామల కహహా
యెట్టివిచిత్రమొ మనసున, బుట్టినవాఁ డపుడు మనసుఁ బుట్టించెఁ జుమీ. 157

చ. చక్కదనంబు రూపునఁ బొసంగుటె కాదు గుణంబులందునుం
జక్కదనంబు గల్గునెఱజాణ జగంబుల నేడులేని నా
చక్కనికూఁతునుం దొరయఁ జాలినవాఁ డితఁ డల్లుఁ డైనఁగా
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
మిక్కిలి కీర్తి గల్గు నని మెచ్చు మనంబున రాజు సారెకున్. 158

చ. అడుగడుగందును న్మణిపురాధిపుఁ డిట్లుచితోపచారముల్
గడు నొనరించి యుద్వహనకౌతుకహేతుకళావిశేష మా
విడిదికిఁ దెచ్చి నిల్పి యతివిస్మయ మందఁగ విందు వీడుకో
లుడుగరలన్ ధనంజయునియుల్లము రంజిలఁ జేసె నెంతయున్. ॥

### ఆశ్వాసాంతము.

మ. సరసాగ్రేసరవాసరప్రభుతనూజస్థూలలక్షాపురం
దరజిద్భోగధురంధరా భరతశాస్త్రప్రౌఢమార్గైకలా
స్వరసాస్వాదనకోవిదా శ్రవణభూషాదివ్యరత్నత్విషా
తరణిశ్రీకరగల్లభా విభవభృత్తంజాపురీవల్లభా. ।

క. యాచనకవినుత వనితా, నేచనకమనోహరాంగశృంగారకళా
సూచనకమ్రకవిత్వా, లోచనకందళితహర్షలోలుపహృదయా. ।

క. తరుణీమన్మథ యాశ్రిత, భరణగుణాభరణశౌర్యబహురాజ్యధురం
ధరసత్యాదిమచక్రే, శ్వర యభినవభోజరాజవరబిరుదాంకా. ।

తోటకవృత్తము. అతులాగమశాస్త్రనిరస్తసురే
జ్యతులాధికవిద్వదవాప్తశత
క్రతులాభశుభోదయకారణర
త్నతులాపురుషాదికదానచణా. ।

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధప్రసిద్ధసారస్వతసుధాసారజని
శోలతాంకూర చేమకూరలక్ష్మణామాత్యతనయ వినయధురీణ సకలకళాప్రవీణ
తేంద్రరఘునాథభూపాలదత్తహస్తముక్తాకటకవిరాజమాన వేంకటకవిరాజ
తంబయినవిజయవిలాసం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ.

# విజయవిలాసము

## ద్వితీయాశ్వాసము.





జానకీమనోహర
పూజాంచితపౌత్త్రపయోజపోష్యాఖిలది
గ్రాజ సకలార్థిజనని
ర్వ్యాజకృపా యచ్యుతేంద్రరఘునాథమణీ. 1

తే. అవధరింపు కథాకర్ణనాతివేల, హర్షులైనట్టిదివ్యమహర్షులకును
తతసమస్తపురాణకథాశతాంగ, సూతుఁడై విలసిల్లెడుసూతుఁడనియె. 2

ఉ. ఆచెలువంపురాకొమరుఁ డంత నయస్యునిఁజూచి యింపుతో
నీచతురత్వ మీవినయ మీయుచితజ్ఞత యెందు నేనియుం
జూచితె మైత్రికిం దగినచో టగు శోభనపుంబ్రసంగముల్
సూచన సేసి రాజు మది చొప్పెఱుగన్ పలదా విశారదా. 3

మ. అనినన్ మీమదిలోఁ దలంచినది మేలా సిద్ధసంకల్పులీ
రని యావేళనె చిత్రవాహనుఁడు గొల్వై యుండఁగాఁ బోయి యా
యన రా రమ్మని గారవించి సుముఖుండై రాజుగా రిప్పుడే
మనినా రెయ్యది వార్త యంచుఁ బయిపై నాసక్తితోఁ బల్కఁగన్. 4

చ. అవనితలేంద్ర మావిభునిహర్ష మదే మని విన్నవింతు సం
స్తవ మొనరించి రింతపడి సామిచరిత్రమె వేయినోళ్లన
ర్ణవపతితోడ బాంధవ మొనర్చినమాధవు లీలఁ దారు బాం
ధవ మొనరింపఁ జిత్తమిడినారు గుణాంబుధు లీరు గావునన్. 5

క. నా విని సంతోషము మది, నావిర్భవ మొంద నామహారాజునకున్
దేవేరిగ నాకన్నెం, బావనగుణ నీయఁ గనుట భాగ్యము గాదే. 6

చ. కల దొకమాటఁ దెల్పఁగలకార్యము దొల్లి ప్రభాకరుండు నాఁ
గలఁ డొకఁ డస్మదీయకులకర్త యతం డనపత్యుఁడై యచం
చలమతి శంకరుం గుఱిచి చాలఁ దపం బొనరింప నంతటం
గలుగుఁ గుమారుఁ డొక్కొకఁడు గా నని యిచ్చె వరంబు వేడుకన్. 7

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అంగజహరునిప్రసాదము, నం గలుగుచు వచ్చె సుతుఁడు నాఁ డాదిగ మా
వంగడమున నది యిప్పుడు, వెంగడమై కూఁతు రుద్భవించె న్నాకున్.

క. ఆదుహితఁ గుమారుని మ, ర్యాదగఁ జూచి కొని యుందు నాకన్నియకుం
బ్రాదుర్భవించువాని, న్నాదుకులంబునకు వలయు నాథునిఁ జేయన్.

క. కా దనరా దీకార్య మ, జాదులును బ్రసాద మహా విశారద నాకు
న్నాదుహితం బొనఁగూరిచి, నాదుహితం బెండ్లి సేయు నరనాథునకున్.

తే. అని యతనిఁ బంచె నామాట కర్జునుండు
సమ్మతించె ముహూర్తనిశ్చయము నయ్యె
హితుఁ డన విశారదుఁడె కాక యెందుఁ గలరె
కోర్కి వెలయంగ దొరఁ బెండ్లికొడుకుఁ జేసె.

క. సుత్రామనిభుఁడు పాండ్యధ, రిత్రీవిభుఁ డానతీయ శృంగారకళా
చిత్రాంగదయుత యగునా, చిత్రాంగదఁ బెండ్లికూఁతుఁ జేసిరి కాంతల్.

క. గరిత లలంకృతి సేయఁగ, గరువపుమురు వపుడు హెచ్చి కన్నియ దనరెం
బరిణయపుంగైసేఁతల, నరపతి యొఱ పతిశయిల్లు నటనఁ జెలంగెన్.

మ. తనవంశంబునృపాలుపెండ్లిఁ గనుతాత్పర్యంబునన్ వచ్చెనో
యనఁ జంద్రుం డలరెం గిరీటి సుముఖుం డై యంతఁ గైసేసి తె
చ్చినభద్రేభము నెక్కి తీవిమెయి వచ్చెన్ బాండ్యభూపాలులో
చనముల్ చల్లఁగఁ గ్రొత్తముత్తియపుసేసల్ జవ్వనుల్ చల్లఁగన్.

చ. నలుగడ హృద్యవాద్యనటనం బొలయం గపురంపుటారతుల్
వెలయ ద్విజశ్రుతుల్ చెలఁగ విప్రవధూశుభగానలీల శో
భిలఁగ వివాహవేదికకుఁ బెండ్లికుమారుఁడు వచ్చె నిట్టు లా
వల నలపెండ్లికూతురును వచ్చె రణచ్చరణాంగదంబులన్.

శా. పంకేజాతములన్ దిసంతు లడుచున్ బాలామణీపాదముల్
వంకల్ దీర్చు మనోజసాయకములన్ వాల్చూపు లేణాంకునిన్
శంక ల్సేయు మొగంబు జక్కవకవన్ జక్కట్లు దిద్దుం గుచా
హంకారంబు మదాలిమాలికల నూటాడించు వేణీరుచుల్.

క. హరిపతి నడుమున కోడెన్, గరువపునడుపునకు నోడె గజపతి యిఁక నీ
నరపతి లోనగు టరుదే, పరవర్ణి నిమెఱుఁగువాఁడివాల్చూపులకున్.

ఉ. చక్కనికన్య[illegible]
జక్కనిశోభనాంగునకుఁ జక్కనియింతియుఁ గల్గు టబ్బురం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

షెక్కుడ నిట్టు లుండ వలదే రతిదేవికి సాటివచ్చుఁ బో
యిక్కనకాంగి మన్మథున కీ డితఁ డీడితరూపసంపదన్. 18

క. అని రూపకళలఁ జూపరు, గొనియాడఁగఁ బేరటాండ్రు గొందఱు తెర వం
చినఁ జూచె నతివ నర్జునుఁ, డనురాగాంబుధి తటాల్న నటఁ దెర యెత్తెన్. 19

తే. కలదు లే దన దసి యాడు కానుతీయఁ
దళుకుమొగమున కెగయు గుబ్బల బెడంగుఁ
జూచి యాతనినిడువాలఁజూపు లపుడు
నిండువేడుక మిన్నంది కొండఁ దాఁకె. 20

చ. చిలుకలకొల్కి గన్గొనియెఁ జేరలఁ గొల్వఁగ రానికన్నులన్
మొలకమెఱుంగునీలముల ముద్దులు గాఱునొయారిమీసముల్
గలకలనవ్వుచక్కని మొగంబు వెడందయురంబు సింగమున్
గలఁచురువాణపుంగవును గల్గినయాకురువీరపుంగవున్. 21

క. అంగజరాజ్యం బేలుట, కుం గట్టినతోరణం బోలో యన నతఁ డా
శృంగారవతికిఁ గట్టెన్, మంగళసూత్రంబు చతురిమం గళసీమన్. 22

ఉ. అనురక్తిం దలఁబ్రాలు వోసె విజయుం డావేళఁ బంగారుకుం
డన రం గొనలినీలవేణిపయి ముత్యాల్ దోయిటన్ ముంచి చ
య్యనఁ బాల్పొంగినకైవడిన్ సిరులు పెంపైఁ బూలు రేకెత్తిన
ట్లనె వర్ధిల్లు మటన్న దీవనలకెల్లం దావలం బై తగన్. 23

తే. తామ్రపర్ణీనదీతీరధరణి నేలు
దొరతనముఁ దెల్పఁగా రాశి దొరలఁ బోసె
ముదితచేతులఁ దలఁబ్రాలు ముత్తియములు
ముదితచేతస్కులై సభాసదులు వొగడ. 24

క. ఈచందంబునఁ గల్యా, ణోచితకృత్యంబు లెల్ల నొనరిచి యంతన్
రాచూలిభోగ్యవస్తు, ప్రాచుర్యమనోజకేళిభవనమునందున్. 25

చ. మినుకుఁగడానిజీనిపనిమేలిమిమంచముపై వసించి యుం
డినయెడ నొయ్యనన్ సఖులు నేర్పునఁ దోడ్కొని వచ్చి ప్రోలిజ
వ్వని నిడి తోడిచూపులకు వచ్చినవారునుబోలె వెన్కకుం
జని రవుఁ గాదె పై నతనుసంగర మానవమోహనాంగికిన్. 26

మ. చంచలనేత్రఁ గాంచి నృపచంద్రుఁడు మోహము నిల్ప లేక చే
లాంచల మంటి శయ్య కపు డల్లనఁదార్చి కవుంగిలింప నుం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కించుఁ బయంట నంటఁ గమకించుఁ జలించు ట చెప్ప డెప్ప డం
చించుక సేపులోన మెఱయించు ననేకమనోవికారముల్.

ఉ. కానుక గాఁగ నిత్తు బిగికౌఁగిలి పల్కవె కీరవాణి నీ
దానుడితేనె నాచెవుల నానఁ గృపారసధార నాన న
న్నానన మెత్తి చూడు నలినానన గోలతనాన నేల లో
నానఁ జలంబు నీకు మరునాన సుమీ విడు నాన యింకిటన్.

చ. చక్కరవింటిదేవర ప్రసాదముఁ గైకొను మిప్పు డింద యో
చక్కరబొమ్మ యంచు విలసన్మణికంకణహస్త మంటి పే
రక్కఱఁ గప్పురంపువిడె మానెఱజాణ యొసంగి నిక్క లేఁ
జెక్కిలి ముద్దు వెట్టుకొనెఁ జెప్పెడి దేమిఁక నావినోదముల్.

ఉ. ఇగ్గెడు వెన్కకుం బయికి నీడ్చినఁ బైఁట దొలంగఁ జేయఁ గే
లొగ్గెడు రెమ్మిపోఁకముడి యూడ్చినఁ గ్రుంగిలి రెండుకొంగులుం
బిగ్గ నడంచుచున్ విడిచిపెట్టదు బాల ననం బనేమి యా
సిగ్గుకు సిగ్గు లే దిటులు సేసిన పిమ్మట నుండవచ్చునే.

తే. కోర్కి వెలయంగ నినుఁ దెచ్చి కూర్చినట్టి
తియ్యవిలుకానిబుణ మెందుఁ దీర్చుకొందు
నువిద నీచేయి చూచుక యున్న నాకు
నింద మని యంది నీవి నీ వియ్యకున్న.

సీ. మకరకేతనుఁ గూర్చి మకరికాలతలు నీ, చెక్కుల వ్రాయంగ మ్రొక్కుకొంటిఁ
గుసుమాకరునిఁ గూర్చి కుసుమమాలికలు నీ, వేనలిఁ దుఱుమంగ వేఁడుకొంటి
గంధవాహనుఁ గూర్చి గంధసారంబు నీ, గుబ్బలఁ బూయంగఁ గోరుకొంటి
మృగలాంఛనునిఁ గూర్చి మృగమదంబుల నీకుఁ, దిలకంబు దిద్దఁ బ్రార్థించుకొం

తే. నిన్ను వరియించునప్పుడే యిన్ని చేయు, వాఁడ నని మున్ను శృంగారవనములో
వల పెఱిఁగి యేలుకోఁగ దే కలికి యనుచుఁ, గేళి కెలయించె నమ్ముద్దరాలి నపుడు.

క. పొక్కిలిపొంతఁ గరం బిడి, చెక్కిలిచెంత నొకకొంత చిఱునవ్వాలయన్
జక్కిలిగింతం గొలిపెన్, మిక్కిలి వింతలుగ రతికి మేకొన నంతన్.

ఉ. డాసిన నింగితం బెఱిఁగి డాయఁగ నేరక తత్తరంబునం
జేసిన సేఁతకున్ బదులు సేయ నెఱుంగక మేను మేనితో
రాసినయంత నే కళలు రంజిలి కౌఁగిట బాలయుండెఁ బో
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
యాసుఖ మింత దంత యన నైనది గాదు గదయ్య క్రీడికిన్.

ఉ. అంగజరాజ్యవైభవసుఖాంబుధి నీగతి నోలలాడి చి
త్రాంగద సేవఁ జేయ మలయధ్వజునిల్లటపల్లుఁ డై తదీ
యాంగబలంబు గొల్వ నరుఁ డందులరాజ్యము సేయు చుండ నా
సింగపుఁజిన్ని లేనడుము చెల్వకు గర్భము నిల్చె నంతటన్. 35

శా. మించెన్ బోరచికోరికల్ గడు విజృంభించెన్ దనూగ్లాని గా
న్పించెన్ మేచకకాంతి చూచుకములం జెక్కుల్ల్పైఁ దెల్పు రె
ట్టించెన్ గూర్కులు సందడించె నడ చండించెన్ మృదామోదముల్
గాంచెన్ వాతెఱ యోసరించెఁ ద్రివళుల్ నానాఁటికిన్ బోటికిన్. 36

క. సీమంతవతీమణికి, న్సీమంతముఁ జేసి రపుడు నెల లెనిమిదిగా
శ్రీమంతు కెక్కుగర్భ, శ్రీమంతుం డీతఁ డనుట సిద్ధము గాఁగన్. 37

క. ప్రొద్దుల నెలలన్ వేవుర, నుద్దులుగాఁ జేయఁ దగుమహోయశములు గా
ముద్దులబాలునిఁ గనియెను, బ్రొద్దుల నెలయెడల నిందుముఖి శుభవేళన్. 38

చ. ధనము లసంఖ్యముల్ హితబుధద్విజకోటికి నిచ్చి యప్పు డా
తనయుని బభ్రువర్ణహయధట్టము నేలెడు నంచు బభ్రువా
హనుఁ డను పేరు వెట్టి చెలు వందఁగ బంగరుఁదొట్లఁ బెట్టి శో
భనవిభవాప్తి రంజిలిరి పాండవపాండ్యవసుంధరాధిపుల్. 39

సీ. తనకులస్వామితంద్రిని సుధాంబుధిఁ బోలుఁ, బాలబుగ్గలమించులీలఁ గనుటఁ
దనపితామహునిబృందారకాధిపుఁ బోలు, రెప్ప వేయక చూచురీతిఁ గనుట
దనవంశకర్త నుత్పలబాంధవునిఁ బోలుఁ, గరము లర్మిలిఁ జాఁచి గారవిలుటఁ
దనతాత యనుఁగుదమ్ముని నుపేంద్రునిఁ బోలు, నల్లనల్లన దప్పటడుగు లిడుట

తే. ధరణి గాంభీర్యవైభవదానకృపలు, గల వని కనంబడఁగ వేఱ తెలుప నేల
యని గురుజనంబు లెంతయు నాదరింపఁ, జిన్నిబాలుఁడు ముద్దులు చిలుకుచుండె.

తే. ఆడితప్పనిధర్మజు ననుఁగుఁదమ్ముఁ, డాకుమారకుఁ జిత్రవాహనున కపుడు
వంశకరుఁగా నొసఁగి వేడ్క వారిచేత, నంపకముఁ గాంచెఁ దీర్థయాత్రాభిరతిని.

మ. చనియాదక్షిణపుణ్యభూమిఁ గనుచున్ సౌభద్రతీర్థంబునం
దును స్నానం బొనరింపఁ బోవ నట నానల్ గొంద ఱోహో నిలుం
డన ఘైత్సుఖపంచతీర్థములయం దత్యుగ్రనక్రంబు లుం
డును నూఁ ఱేడులనుండి యిందు నొకనాఁడుం జేరరా రెవ్వరిన్. 42

ఆ. మోక్షము [illegible] మగు నటంచు
గ్రుంక వెఱతు రెవ్వరును మీర లటుపోకుఁ, డనిన నవ్వుకొనుచు నర్జునుండు. 43

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. ఏను తీర్థము లాడఁగ నేఁగుదెంచి, యేనుతీర్థము లాడనో డివలఁ జనుట
పౌరుషమె యంచుఁ గ్రుంకఁబో వారిచరము, పట్టఁ బట్టిన నమ్మహాబాహుబలుఁ

క. ఎడమకరంబున నే య, య్యెడ మకరముఁ బట్టి బయిటి కీడిచి వైవన్
బడి భూమికిఁ జూపిన కై, వడిఁ దొల్లిటిరూపు వాసి వాసి యెసంగెన్.

ఉ. పట్టుప్రవగుబ్బలుం దొగరువాతెఱయుం జిఱునవ్వువెన్నెలల్
దొట్రిలుముద్దుమోమును దళుక్కను మేను వెడందసోగ యై
పట్రిలుకన్నుదోయి నిడువాలుఁగురుల్ బిటువుంబిఱుందు లేఁ
గుట్రనునుంగవున్ గలుగుకోమలి యై యది మ్రోల నిల్చినన్.

క. ఆలోలనయనఁ గనుఁగొని, యాలోచనఁ జేసె నృపతి యద్భుతమతి యై
యాలో నిది యచ్చర ప్రో, యాలో కాకల్ల మరునియాలో యనుచున్.

క. ఈబాలమోమునకు నా, జాబిల్లికి నెంతదవ్వు సరిపచ్చనో కో
యీబిడచనుఁగవ కొకమె, ట్టాబంగరుగట్టు తక్కు వౌ నెంచంగన్.

క. నడు మెంత సైక మోహో, పిడికిటిలో నణఁగు బెళుకు బేడిసమీలం
గడకొత్తుఁ గన్ను లౌరా, జడయందముఁ జెప్పఁ బాఁప జగతిం గలదే.

మ. అని యాక్రీడి మనంబునం బొగడి యాగ్రాకారన క్రంబ వై
మును పట్లుండిన దేమి మేలు చెలువంపుం గల్కి వై యిప్పు డొ
ప్పిన దే మెవ్వరిభామినీమణివి నీపే రేమి నా నిట్లనున్
విను మోభూవర యానుపూర్విగఁ బుగావృత్తాంత మాద్యంతమున్.

క. ఏ నంద యనెడు నచ్చర, చానన్ దరుణేందుధరునిసఖునియనుంగన్
నానెచ్చెలులు త్రిలోకీ, యానేచ్ఛలు గలరు నల్వు రతులశుభాంగుల్.

ఆ. వారు లలిత పద్మ సౌరభేయి సమీచి, యనెడుపేర్లు గలుగునట్టివారు
జగములెల్లఁ జూచి చనుదెంచుచో మేము, ఐనధిఁ గాంచి నొక్కవనముఁ గాంచి

మ. విహరించున్ మలయానిలం బచటఁ దావిం జిల్కు నెమ్మేని యా
విహరించున్ బికనాదముల్ చెలికిఁ గావించుం జవుల్ పోద మా
సహకారాళిపదంబుఁ జూడఁగ పయస్యావాళి వాటిల్లెదున్
సహకారాళిపదంబుఁ జూడఁగ పయస్యావాళి యానే కదా.

క. అని యితరేతరచతురో, క్తిని గుంభన మెఱయ నరిగి తేఁకువ నందున్
మునియొకఁడు దపము సేయం, గని యది విఘ్నంబు సేయఁ గడఁగి కడంకన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
క. నెఱికురులు [illegible]లు, ని[illegible]చన్నులు [illegible]కన్ను [illegible] కొనల్
జిఱుఁదొడలు నంచనడలున్, మెఱపులయొఱపులు ఘటింప నిలిచి నటింపన్.

క. మాపాలు పాకింత గనుఁగొని, తాపసుఁ డఁట వలపు పేరు దైవ మెఱుంగున్
శాప మొసఁగె మకరులుగాఁ, గోపరసావేశరూక్షకుటిలేక్షణుఁ డై. 56

క. అందులకుఁ జాల భయపడి, యందఱ మడుగులకు వ్రాలి యతిదీనతతోఁ
గొందలపడ నపు డాతని, డెందము గైకొనిరియె నక్కటికపుంబెంపున్. 57

ఉ. శీతలదృష్టిఁ జూచి మునిసింహుఁడు నావచనం బమోఘ మో
భీతమృగాక్షులార వది బెగ్గిల నేల యిఁకన్ వినుండు మీ
చేత గృహీతుఁ డై సలిలసీమను నెవ్వఁడు వెల్వరించు మి
మ్మాతఁడె శాపమోక్షకరుఁ డయ్యెడుఁ బొం డని పంచెఁ బంచినన్. 58

చ. ఇలఁ గలవీళ్లు సూడ మన మేటికిఁ బోవలెఁ బోయినన్ వని
న్నిలువఁ బనేమి నిల్చిన మునిం గని త్రుళ్ళఁగ నేల యంతలో
నలిగి శపింప నేమిటికి నాతఁడు వ్రాఁతఫలంబు దప్పునే
కలిగినవే కదా మకరికల్ మన కెప్పుడు వ్రాసి యుండుటల్. 59

తే. అనుచు ననుతాపమునఁ ద్రోవఁ జనుచు నుండ
నారదుఁడు సూచి యచ్చరలార మీరు
చిన్నవోయినమొగముల నున్నవార
లే మనినఁ బూర్వవృత్తాంత మెల్లఁ దెలిపి. 60

తే. ఋషితిలక కంటివే మాయదృష్టరేఖ,కుడిచి కూర్చుండి యిదె యొకబెడఁదదెచ్చు
కొంటి మే మేడ మకరులై యుంట యేడ, నర్హ మే యిట్టిబాధ బింబాధరలకు. 61

క. అన విని యనిమిషముని యో, వనితాతిలకంబులార వసుధాగీర్వా
ణునిశాపము విధికృత మే, ఘనునకుఁ దప్పింప నలవి గా దటు లగుటన్. 62

ఉ. మీరలు దక్షిణాంబుధిసమీపమునం దగుపంచతీర్థముల్
చేరియు గ్రాహరూపములఁ జెంది శతాబ్దము లున్నఁ దీర్థసే
వారతి భారతాన్వయుఁడు వాసవనందనుఁ డర్జునాఖ్యుఁ డే
తేరఁ గలం డతండు కడతేర్చు మిమున్ దృఢసాహసంబునన్. 63

క. చనుఁ డచటికి నిపు డింపెన,య'న దుఃఖం పంచభిస్సహ' యనంగా మున్
విని యుందురె కద యేటికి, మనమున సుమ్మలికఁ జెందఁ మదవతులారా. 64

మ. అంచున్ మమ్ముల నూఱడించ వినయాహ్లాదంబు లెంతే విజృం
భించన్ మ్రొక్కి జగంబులందును మిముం బేర్కొన్నమాత్రం బటా
పంచంబై దురితంబు లెల్లఁ జనఁగా భక్తిన్ మిముం న్నేఁడు ద
ర్శించన్ ఖేద [illegible] మదిం జెన్నారెదో నారదా. 65

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. మీకతమున నూఱేండ్లని, మాకున్ మితి యెఱుఁకపడియె మంటి మటంచున్
లోకేశ్వరసుతుదీవన, ఁ జేకొని యిట వచ్చి నిలిచి చిత్తములోనన్.

క. దుర్జనవిసర్జనముగ, నిర్జరలోకాధినాథునిసుతుం డగు నా
యర్జును సజ్జనసముదా, యర్జునుఁ గనుఁగొనెడిభాగ్య మది యెన్నఁటికో.

చ. అని తలపోయుచు న్మకరికాకృతు లూని యి టుండఁగా నిదే
పనిగ మదీయపుణ్యపరిపాక మనం జనుదెంచి నీవు న
న్మనిచితి వే కదా కడమ నాచెలు లౌజలచారిచారులో
చనలకు శాపమోచనము సల్పి కృతార్థలఁ జేయు పార్థివా.

క. అని నంద వేడినం ద, క్కినతీర్థము లాడి వారికిన్ శాపవిమో
చన మొనరింపగ నేవురు, జనుదెంచి శుభాంగలీల సన్నిధి నిలువన్.

క. కలలో నెఱుంగ మేగణి, కలలో నిచెలువము నకలలోకములన్
కలలోలాత్ములగరగరి, కల లోఁ గొనినారొ చంద్రకలలో వీరల్.

క. అని తనచే నిజరూపముఁ, గనిరి గదా యనుచు వేడుకం దగునృపతిం
గని యాయచ్చర లిట్లని, కొనియాడఁ దొడంగి రధికకుతుకాన్వితలై.

సీ. బలవైభవంబుచే గెలుచుమాత్రమె కాదు, గమనలీలను గెల్చుగంధకరిని
గీర్తివిస్ఫూర్తిచే గెలుచుమాత్రమె కాదు, నగుమొగమ్మున గెల్చుఁ దొగలఱేని
బలుసాహసంబుచే గెలుచుమాత్రమె కాదు, మినుకుఁగౌనున గెల్చు మృగకులేశు
నలఘుదానంబుచే గెలుచుమాత్రమె కాదు, నెఱులకాంతిని గెల్చు నీరదము

తే. సకలసద్గుణసౌందర్యసారమూర్తి, యనియె ముని నారదుఁడు చెప్ప వినియయో
మిమ్మహాభుజు నిప్పుడో కొమ్మలార, కంటిమి గదమ్మ కన్నుల కఱవు దీఱ.

తే. బాపురే రాజుగర్వంబుఁ బాపురూపు, చాఁగురే రాజుకలల మిం చాఁగురేఖ
మేలు నలరాజు సోయగ మేలుఁ జెలువ, మమ్మ యీరాజు ప్రతి గాన మమ్మ యో

తే. అందఱును నింద్రనీలశుభాంగుఁ డందు, రింద్రనీలశుభాంగుఁడే యితఁడు గో
దండ్రిఁ బోలినరూపుమాత్రంబె కాద, యారెభూలోకదేవేంద్రుఁడంచుఁ బో

తే. నీకుఁ గల్యాణ మౌ రమణీయరూప, నీకు వంశాభివృద్ధి యౌ నృపకలాప
నీకు జయ మగు సాహసనీతిభరిత, నీకు సామ్రాజ్య మౌ మహనీయచరిత.

శా. అంచున్ వేలుపుమిఁచుఁబోణులు శుభోదర్కంబు గాన్పించ దీ
వించన్ వారిఁ బ్రియానులాపములచే వీడ్కొల్పి గోకర్ణభూ
ప్రాంచద్ధ్వజ [illegible] ద్ర[illegible]
గంచున్ బోయి ప్రభాసతీర్థమున వేడ్కం గ్రీడి క్రీడించుచున్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. ద్వారకాపుర మచటికిఁ జేరు వనుచుఁ, జెప్పఁగా విని కడుసంతసిల్లి కలదు
గా యిఁక సుభద్రరూపరేఖావిలాస, విభ్రమంబులు గనఁ జూడ్కి విందుగాఁగ.

క. అరచందమామ నేలిన, దొరగా నెన్నుదురు నెన్నుదురు బిత్తరికిన్
బఱువంపు మొల్లమొగ్గల, దొరగాఁ బల్కుఁ గుఱు బల్కుదురు జవ్వనికిన్. 78

క. అలకలు నీలము లధరం, బలపగడము గోళ్లు ముత్తియంబు లటంచున్
దెలుప మను విందుఁ జిలుకల, కొలికి తెఱం గెల్లఁ బూస గ్రుచ్చినరీతిన్. 79

తే. అనుచు నాకన్యఁ గైకొనునాసఁ దగిలి, యతులకు విధేయు లగుదురు యాదవు లని
తను నెఱుఁగ కుండవలె నన్యు లనియును తలఁచి,యనుచరజనంబునందందపనిచియంద.

సీ. మృగనాభితిలకంబు బుగబుగ ల్గలలలా, టముపై మృదూర్ధ్వపుండ్రంబు దీర్చి
తపనీయకౌశేయధారేయ మగుకటీ, రమునఁ గాషాయవస్త్రము ధరించి
శరణాగతాభయసందాయకం బైన, దక్షిణపాణిఁ ద్రిదండ మూని
రణచండకోదండగుణకిణాంకం బైన, డాకేల నునుఁగమండలువు దాల్చి

తే. యుండెఁ బో శాంతరస మెల్ల నుట్టిపడఁగ,నంగనలపొందు రోసి సన్న్యాసియగుట
గద యుచిత మెందు నానవమదనమూర్తి,యంగనామణిఁ గోరి సన్న్యాసి యయ్యె.

క. ఇటులుండి తనదుకోరిక, ఘటియింప హలాయుధుండు గాఁ డనుకూలుం
డటులైన నేమి యఘటన,ఘటనాచతురుండు గలఁడ కా హరి యనుచున్. 82

క. గోపాలనందనుం డా, గోపాలకచక్రవర్తి కోమలదివ్య
శ్రీపాదపద్మములు దన, లోపలఁ దలపోయ నంతలోపల వేగన్. 83

ఉ. సన్నపుసన్నచేలఁ గటిజుట్టి కిరీటము మౌళిఁ దాల్చి రే
మన్నియతోడఁ బుట్టు పెనుమానిక మక్కునఁ జేర్చి వచ్చి చెం
త న్నిలిచెన్ దయారస మెదం బొదువన్ యదువంశదుగ్ధవా
రాన్నిధిపూర్ణిమావిశదరశ్మిదరస్మితచారువక్త్రుఁడై. 84

ఉ. అప్పుడు సామి దాఁ దలఁచినంతనె వచ్చె నటంచు విస్మయం
బుప్పతిలంగ వేడ్క నన లొత్తఁగఁ గన్నుల హర్ష బాష్పముల్
చిప్పిలఁ గ్రీడిపాదసరసీజములం బ్రణమిల్లి తద్రుచుల్
ఱెప్పల నప్పళించుచును లేవక యుండఁగ సంభ్రమంబునన్. 85

ఉ. గ్రుచ్చి కవుంగిలించుకొని కూరిమితోఁ గుశలంబు వేఁడి తా
వచ్చినరాక లోఁ దెలసి ద్వారకరైవతకాద్రిప్రాంత నే
యిచ్చటికిన్ సమీప మని కృష్ణుఁడు దెల్పుచుఁ దోడితేరఁగా
వచ్చె రథంబుపై నపుడు వాసవి వేసవి రోఁగు నంతటన్. 86

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. వచ్చి రైవతకారామవాటి నిల్చి, కృష్ణుఁ డంద దిష్టగోష్ఠి నారేయి కడపి
యిచట నుండుము తావకాభీష్ట మిపుడు, సేయు మనటంచుఁ బైతృష్వసేయు నిల్పి.

ఉ. ద్వారక కేఁగి యందు బుధవర్గము బందుజనంబు లాప్తులుం
గోరి భజింప నుండి యొకకొన్నిదినంబులమీఁద భక్తమం
దారుఁడు వాసుదేవుఁడు ముదంబున రైవతకాచలోత్సవ
శ్రీ రచియింపఁగా వలయు రే పని మంత్రులఁ జూచి పల్కినన్. 88

ఉ. అప్పుడె వారుఁ దీర్పరుల నందులకున్ సమకూర్చి జాళువా
యొప్పులకుప్పలై మెఱయు చుండెడు మేరువులుం గురుంజులున్
జప్పరముల్ వితానములు సర్వము నాయితపెట్టి కానుకల్
దెప్పలుగా నమర్చి రతితీవ్రత రైవతకాచలంబునన్. 89

చ. అపు డొకమాటఁ గంసరిపుఁ డానతియిచ్చెనొ లేదొ మంచిచొ
క్కపుఁగపురంపుగిన్నియలు కస్తురివీణెలు రాశిగాఁగఁ గొం
డపొడవు దెచ్చి వైచిరచటన్ మఱి లెక్కనపస్తు లంటిమా
యపరిమితంబు లే మనఁగ నవ్విభుపట్టణభాగ్యసంపదల్. 90

తే. గంధమాల్యాభరణవస్త్రకలితు లగుచుఁ, గామిపరత్నములు దారుఁ గలసి మెలసి
చనిరి రైవతకోత్సవంబునకు నపుడు, వీరు వారన కయ్యదువీరువారు. 91

చ. కలయఁగఁ జెంద్రకావిఱవికంబలెఁ గుంకుమఁ బూసి చూడు మో
పొలఁతుక నాదు నే ర్పనినఁ బూసినయట్లనె లెస్సయున్న దే
బళి యని కేళినీరమణి పల్కిన నవ్వుచు శంబరారి య
ర్మిలిఁ గయినేసి యేఁగిరి గిరిం గన నారుచిరాంగు లిర్వురున్. 92

ఉ. రేవతిగుబ్బచంటిమకరీమయరేఖ లురఃస్థలంబునన్
భావజచిహ్నముద్ర లయి భాసిల మేలిమికందుదుప్పటిం
బైవలెవాటు వైచి నును మైజిగిగందపుఁబూఁత యై తగన్
రైవతకాద్రి కేఁగె బలరాముఁడు కేళికళాభిరాముఁ డై. 93

క. నగధరునివెంట నడిచిరి, మిగులం గైసేసి యటఁ దమిం గస్తూరీ
భుగభుగలు సుదిరిబంగరు, నిగనిగ నెఱ యంద ఱవలు నెఱయం దెఱపల్. 94

చ. పురజను లింపునం గనఁగ బొంతల రుక్మిణి సత్యభామయుం
దొరయఁగఁ దక్కునార్వురును దోఁ జన నావెనుకం బదాఱువే
ల్తరుణులు గొల్చిరాఁగఁ బ్రమదంబునఁ గృష్ణుఁడు వట్టివేళ్ళచ
ప్పరములన్ యొసగిన్ బట్టినకానుక లెల్లఁ జూచుచున్. 95

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఆగతి నరిగి సమస్తజ, నాగతి రైవతకగిరిమహామహాలీలా
భోగము గన్నులపండువ, యై గాఢకుతూహలంబు నడరం జేయన్. 96

ఉ. మున్నతిభక్తిఁ బూజలు సమున్నతిఁ దా నొనరించి యాత్మయో
షిన్నికరంబులం బిదప సేవ లొనర్పఁగఁ జేయుచుండె నం
త న్నవరత్న హేమరచితం బగుపల్లకి నెక్కి వేడ్క రా
నన్నలు రామకృష్ణులు రయంబున రమ్మని గారవింపఁగన్. 97

క. చెలియలు సుభద్ర వచ్చె, న్జెలియలు వేయాఱులు నిరుచెంతలఁ గొలువన్
దొలకరి మెఱపో యిది యని, తొలకరిదొరబిడ్డ వెఱఁగుతోడం జూడన్. 98

ఉ. యానతచూలికాభరణ మప్పుడు కొందఱు బోట్లు ముంగలన్
రైవతకోత్సవాగతజనంబు బరాబరి సేయుచుండఁ ద
ద్దైవత కర్పనానతు లతిప్రమదంబునఁ జేసెఁ బైపయి
న్దైవతరాజనందను ధనంజయునిం బతిగాఁ దలంచుచున్. 99

తే. ఈకరణిఁ బూజ లొనరించి యిష్టసఖులఁ, గూడి యగ్గిరికందరాకూటతటవి
నోదవైఖరు లెల్లఁ గన్గొనుచు సరస, గోష్ఠి నుండెఁ బద్మరాగోష్ఠిఁ జూచి. 100

క. మును విన్నది తా నప్పుడు, గనుఁగొన్నది యొక్కటియగాఁ దార్కొనై
పెనఁగొన్నమహాశ్చర్యం, బున నన్నరుఁ డిట్టు లనుచుఁ బొగడం దొడఁగెన్. 101

ఉ. చూడమె దేవతాసతుల శోభనకాంతివిలాసవైఖరుల్
చూడమె నాగకన్యకల లోకమనోహరరూపసంపదల్
చూడమె మర్త్యకామినులసోయగముం దమకంబు పెల్లు తీ
పాడఁగ దీనివంటియొఱపైనమిటారినిఁ జూడ మెందులన్. 102

క. చెక్కులజిగి చనుగుబ్బల, చక్కఁదనము మొగము తేట జడతీ రారా
చొక్క మగుదీనిఁ జూచినఁ, జొక్క మనం గూడ దెట్టిసుజ్ఞానులకున్. 103

ఉ. కన్నులు దీర్ఘముల్ నగుమొగం బవురా తలకట్టుతమ్మిపూ
పున్నమచందమామలకుఁ బొక్కిలి చక్కఁదనంబుఁ జెప్పఁగా
నున్నదె మేలుబంతులు పయోధరముల్ మఱి కౌను సున్న యా
నెన్నిక కెక్కు వ్రాఁతఫల మివ్వరవర్ణి నికి న్నిజంబుగన్. 104

తే. భ్రమరకమనోహరం బౌటఁ బక్ష్మ మగును
తారకాహృద్య మగుట సుధానిధి యగు
రెంటిజగడాలు మోమున నంటి యుంట
నబ్జముఖి య[illegible]. 105

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ధారాధరము వెన్ను దన్ని పుట్టినచాయ, నున్న దీబింబాధరోష్ఠి వేణి
జక్కవకవ బొమ్మ త్రొక్కి నిల్చినజాడ, నున్న వీనవలాపయోధరములు
చిన్నిప్రాయపురేడిఁ జెవులు వట్టాడించు, గతి నున్న దీరామకన్నుదోయి
నల్లచీమలబారు నడుము దాఁకినవీఁక, నున్న దీచెలువంపుఁగన్నెయారు

తే. విపులపులినంబు వెన్కకు వీఁగ నొత్తు, నందమున నున్న దీమందయానపిఱుఁదు
దీని కెన యైనలతకూనఁ గాన మామ, నోజవజ్రాంగి యీజగన్మోహనాంగి.

క. సైకము నడుము విఁగాసర, సైకము నెమ్మొగము దీనిమృదుమధురోక్తుల్
పైకముఁ దెగడు న్నవలా, పైకములో నెల్ల మేలుబం తిది బళిరా.

ఉ. ఇత్తరళాక్షి మేనిజిగి యేలిక మేలికడాని పైఁడి కీ
గుత్తపుగుబ్బలాఁడిజడ సాఁకటి చీఁకటిమూలదుంప కీ
పుత్తడిబొమ్మకన్నుఁగవపోలిక వాలికగండుమీల కీ
బిత్తరిముద్దునెమ్మొగము పిన్నమపున్నమచందమామకున్.

తే. కామినీమణినిడువాలుఁగన్నుఁగవకు, నెన్నికకు రానితొగరేకు లీడు సేఁత
తగదు తగ దీఁక నలినపత్త్రింబులందు, నీడగునొ యేమొ మాట వేయింట నొ

క. మహిలో సరి గలదా యీ, మహిళోత్తంసంబు మేనిమహిమకుఁ దెలియన్
మిహికందనపుసలాకన్, మహికాకర రేఖ మించు మించున్ మించున్.

సీ. కలిగెఁబో యీయింతికులుకుగుబ్బలఁ జూడ, శీతశైలాదులసేవఫలము
కలిగెఁబో యీనాతివళులయందముఁ జూడ, గంగాతరంగముల్ గన్నఫలము
కలిగెఁబో యీరామకనుబొమ ల్వాడంగ, మునుధనుష్కోటిలో మునుఁగుఫ
కలిగెఁబో యీభామకటివిలాసముఁ జూడ, భూప్రదక్షిణము సల్పుటకు ఫల

తే. తోడుతోడనె యిటులు చేకూడవలదె, తన్వి దీఅంగ నింక నీతన్విఁ గూడి
సరససంభోగసల్లాపసరణిఁ, దేలు, నాఁడు గా ఫలియించుట నాతపంబు.

క. అని కొనియాడుచు నుండఁగ, వనితామణి నంత నుత్సవము చేసి పురం
బున కన్పుచు మాయాముని, గనుఁగొని యాహాలి నితాంతకౌతూహలి యై.

తే. అతని నుత్తమయతియ కా మతిఁ దలంచి, వినయమునఁ జేరి సాష్టాంగవినతిఁ జే
స్వామి లెందుండి యిచటికి వచ్చినారు, తీర్థయాత్రగ నది యెల్లఁ దెల్పుఁడ

క. హిమశైలసేతువులమ, ధ్యమునం గలనదులు నిధులు నాశ్రమములు దీ
ర్థములుం దాఁ గనుఁగొన్నవి, క్రమమునఁ దెలుపం బ్రమోదరసపరవశుఁడై

మ. కలి [illegible] గృతా
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
ర్థులఁ గాఁ జేయఁగ నాత్మలోఁ దలఁచి చాతుర్మాస్య మిచ్చోటనే

సలుపం గా వలె స్వామివా రని నమస్కారంబు గావించి ప్రాం
జలిరై వేఁడిన సమ్మతించెఁ గుహనాసన్న్యాసి యుల్లాసి యై. 115

తే. చెలువనేత్రవిలాసంబు చెవులు సోఁక, బాలకుచలీల యెదఁ జాలఁ బట్టి క్రాలఁ
గలికినెటివేణిచెలువంబు కాళ్లఁ బెనఁగ, నవలఁ బోలేక నిలిచె నయ్యర్జునుండు. 116

క. సీరియు నిటులా శౌనా, సీరియు నన్యోన్యసూక్తిసితమానసు లై
పోరానిపూర్తి నుండఁగ, నారామునికడకు నంత హరి సను దెంచెన్. 117

క. చనుదెంచిన స్వాములకున్, వినయము గావింపు మిచట వీరల నిలుఁవుం
డనినార ముపవనంబున, నునిచి మనసుభద్ర సేవ కొనరుపు మన్నన్. 118

తే. వయసువారను జక్కనివారు వీరు, మనసుమర్మంబు లేమియు మనకుఁ దెలిసి
యున్నయవి గావు సేవకు నునుపఁ దగునె, కన్నె నదియేమొ తెలిసికొమ్మన్నతఁడు.

క. వీరుమహాత్ములు ఘను లప, చారం బగు నిట్టులాడ సంయములకు మున్
గోరిక వెలయఁగఁ గన్యలె, గారా శుశ్రూష సేయఁ గాఁ దగువారల్. 120

ఉ. నెమ్మది సంశయింప కిది సేవొనరింపు మటన్న నట్లె కా
నిమ్మని యమ్మునిప్రవరుఁ గృష్ణుఁడు దోడ్కొని ద్వారకాప్రవే
శమ్మొనరించి యంతిపురిఁ జయ్యనఁ జెల్లెలిఁ బిల్వ నంపి రా
వమ్మ సుభద్ర నీయభిమతార్థము లెల్ల ఫలించు నియ్యెడన్. 121

శా. కామాదిస్ఫురణంబు లెల్ల నడఁగంగాఁ జేసి ధన్యాత్ములౌ
స్వాముల్ వీరలు వీరికిం బాదవుశేవన్ సేవ గావింపు మెం
తో మోదంబున నానతిచ్చి బలభద్రుండే నియోగించినాఁ
డే మా చెప్పితి నంచు నుండెదవు సుమ్మీ నీమదిన్ సోదరీ. 122

క. అని తత్కన్యాంతఃపుర, వనవంజులకుంజసంజవనమునఁ గుహనా
ముని నుండఁ జేసి పలికెన్, నెనరు మదిం బాదల రుక్మిణీసత్యలతోన్. 123

క. అతఁ డెవ్వఁ డెఱుఁగుదురె మీ, మతిలోనన యుండ నిండు మనకుం దనవుం
బ్రతిమ యగుసుభద్రకు నై, యతివేషముఁ బూనియున్న యర్జునుఁడు సుఁడీ. 124

క. తనమదిలో నితఁ డర్జునుఁ, డని తెలిసి సుభద్ర సేవ కరుగక యున్నం
జని మీ రతనికి భోజన, మొనరింతురు గాని యూరకుండెదరు సుఁడీ. 125

మ. అతనిం బూజ లొనర్పఁ డిప్పు డని నెయ్యం బొప్ప గోపాలుఁ డా
నతి యీ నర్మిలి మ్రొక్కి నిన్నుఁ గని యెన్నాళ్లో కదా యంచు వ
చ్చితివా యన్న కిరీటి కూర్మి కలదా చెల్లెం ప్రపై నంచుఁ ద
త్సతు లేకాంతమునం బ్రియోక్తులను బూజల్ సేసి వీడ్కొల్పినన్. 126

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. అన్నరుం డంత శ్రీకృష్ణుఁ డున్ననగరి, సరసఁ గన్నియరాణివాసమున నపుడు
కేళివనిలోన నవరత్నకీలితంపు, బవిరిడాకులచిన్నియొప్పరిగలోన.

తే. తెలుపనెలవంకబొమలును మెఱుఁగువాఁడి, చూపులును జూచి తనచేతినూటిగ
యస్త్రసన్యాస మొనరించినట్టిసుమశ, రాసనుం డనఁ జెలిమీఁదియాస నుండె.

క. అందుండి మనసులోన ము, కుందుం డీగతి నొనర్చుకుశలత కతఁ డా
నందమునఁ జెందుచుండఁగఁ, గొందఱు గారాబుచెలులు గొల్వఁగ నంతన్.

ఉ. చందురకావిపావడపిసాళిరుచుల్ సరిగంచుఁజీరపైఁ
జిందులు ద్రొక్క వేణికటిసీమపయి న్నటియింప జాళువా
యందెలు మ్రోయ జంటెలవికంటి చనుంగవ పిక్కటిల్లఁగాఁ
జందనగంధి వచ్చె రభసమ్మున నమ్మునిరాజుసేవకున్.

ఉ. వచ్చిన దాలఁ గాంచి తలవంచి జపంబునెపంబు వెట్టి వి
వ్వచ్చుఁ డొకింతసేపు తనపంకఁ గనుంగొనకున్న మెల్లనే
యచ్చట నిల్చి నిల్చి వినయంబునఁ జేరి కుచంబు లోరగా
హెచ్చినభక్తి మ్రొక్కి యనియెం జెలి యంజలిఁ జేసి యింపుగన్.

ఆ. ఓమహానుభావ యేమి గావలె దేవ, పూజ కిపుడు పత్త్రపుష్పఫలజ
లాదికములు దెత్తునా యనవుడు నట్ల, సేయు మనుచు నతఁడు సేయి సూప.

సీ. తనయరుణాధరంబునకు నీ డివి యన్న, రమణ నేఱిచి పల్లవములు గొన్ని
తనతనూసౌరభంబునకు జో డివి యన్న, చందాన వెదకి పుష్పములు గొన్ని
తనమధురాలాపమునకు దీ టివి యన్న, పగిది నారసి తియ్యఁబండ్లు గొన్ని
తనలేనగవుతేటకును బాటి యివి యన్న, పోల్కి దేఱిచి హిమాంబువులు గొన్ని
తే. పత్త్రపుటికావిధూపలపాత్త్రికలను, దెచ్చి వినయంబుతోడ నందిచ్చె నపుడు
పసఁడిగాజులమిసమిసల్ పైకిఁ బొలయ, జకితబాలమృగీచకచకితనయన.

ఉ. గెంటని పేర్మి మేను పులకించెఁ గిరీటికిఁ బూ లొసంగి వా
ల్గంటి గిఱుక్కునం దిరుగఁ గమ్మని కస్తురితావి గ్రమ్ముకొ
గింటెపుగబ్బిగుబ్బలజిగిన్ వెలిఁజిమ్మునొయారిజిల్గుప
య్యంటచెఱంగొకింత దనయంగముపై నటు సోఁకి నంతటన్.

క. చేసె జప మతఁడు గడువి, శ్వాసము చెలిచూపుబేడిసలపై నిగుడన్
జేసినయది జపమున్ మఱి, వేసినయది గాల మనుట వృథగా కుండన్.

తే. భామమోమున వేల్పురూపంబుఁ జూచి, ముదితయొద్దఁ [illegible]డుమూర్తిఁ దలఁచి
రమణి మైసగ మైనవిగ్రహము సెంచి, పోవుమని వేఁడుకొను దేవపూజవేళ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. వినతిఁ జేసిన భిక్ష గావింపుఁ డనిన, మాఱు పల్కింప నివి చెత్తుమా యటన్నఁ
బల్కు నారాయణా యనుభాషణంబె, యల నిజాలకు సన్యాసిపలె నతండు. 137

క. భయభక్తుల నిటు లాకృతి, కయతిగ్రామణికిఁ గన్యకామణి శుశ్రూ
ష యొనర్చుచుఁ గొన్నాళ్లుం,డి యొకానొకనాఁడు తనదుడెందములోనన్. 138

ఉ. వాసవిరూపచిహ్నములవార్తలు మున్ విని యుండుదుం గదా
యాసాబ గెల్ల నేఁడు గన నయ్యెడు వీరలయందు నైన స
న్న్యాస మసంగతం బగుమహాసుకుమారుఁడు రాకుమారుఁ డీ
గాసికి నోర్చునే కలరె కా మఱి మానిసిఁ బోల మానుసుల్. 139

క. అని సంశయ మొకయించుక,యును లే కెప్పటివడువున యువతివతంసం
బనువుగ నతనికిఁ బూజన, మొనరించుచు నుండె నంతిక్రోద్యానమునన్. 140

సీ. కరము సాఁచి నవాంబుకలశ మీ విడిపడ్డ, కుంకుమాంకపుముద్దుఁజంక మెఱుపు
ననలుఁదేఁ బోఁ గాళ్లఁ బెనఁగు నంచ నదల్పఁ, జూచుజంకెనవాఁడిచూపు బెళ్కు
పూరెమ్మ వంచుచో జాఱుపయ్యంట దాఁ, గిలిమూఁతలాడుగుబ్బల బెడంగు
పాలఁతి కాయో పండో పోయినపని యన్నఁ, జిలుకమాటకు నవ్వుసోలపుఁదేట

తే. మఱియు మఱి నును జూడనే మనసువాఱి, వారికుసుమఫలంబులఁ దేరఁ బనుచుఁ
దొలుతటివి చాల వని యాపఘూలఁగామ, నే మనఁగ వచ్చు విప్వచ్చు నేమ మింక.

తే. తెమ్ము బంగారుకుండ జలమ్ము లనుచుఁ, దెమ్ము లతకూన మంచిసుమమ్ము లనుచుఁ
దెమ్ము బా గైనకొమ్మఫలమ్ము లనుచు, మించుఁబోణిని నేరుపు మించఁ బలుకు. 142

క. తుమ్మెదవలె నున్నది యిటు, రమ్మని నెఱికొప్పు నివిరి భ్రమసితిఁ దరుణీ
కమ్మవిరినల్లగలు వని, క్రమ్మఱ మఱుపెట్టుగుట్టు గన రా కుండన్. 143

క. నిద్దంపుమేలిసొమ్ములు, దిద్దినకస్తూరిబొట్టు డినచల్వలు నై
ప్రొద్దొకసింగారముతో, ముద్దియ చనుదేర మిగుల మోహాతురుఁ డై. 144

చ. బలిమిని బట్టఁగాఁ దివురుఁ బట్టిన నొప్పక యిట్ట టన్నచోఁ
బలువు రెటింగి రేని నగుఁబా టని కొంకుఁ దలం పెఱుంగకే
కలయఁగఁ జూచుటల్ తగవు గా దని యుండు నతండు కాంత నె
చ్చెలుల నొకింత పాసి తనచెంత మెలంగుచు నున్నవేళలన్. 145

చ. అట జగదేకసుందరికి నై యతివేషముఁ బూని వచ్చి నాఁ
డఁట తనచేయుభాగ్యమున నప్పువుఁబోణియె చెంత సేవ సే
యుట కని వచ్చియుండు నఁట యొక్కొకపట్టున నొంటిపాటు నా
నఁట యతఁ డెప్పు డెప్పు డను టబ్బురమే మఱి తలఁచి చూడఁగన్. 146

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. సుందరి రానిచో నెమరు సూచుచు నుండెను పట్టె వచ్చుచో
నిందునిభాస్యచక్కఁదనమే కని చొక్కుచు నుండెఁ బట్టె నీ
సందడిచేతనే యరుగసాగెను బ్రొద్దిఁక వేళ యెప్పుడో
సంధె జపంబు నర్చనలు సల్పుట కాకపటత్రిదండికిన్.

తే. వెలఁదికెమ్మోవిఁ గని జపావృత్తి మఱచెఁ
దరుణిలేఁగౌను గని హరిస్మరణ మఱచెఁ
గడమ యన నేల వేస మొక్కటియెతక్క
మఱచె నన్నియు నాకృత్రిమత్రిదండి.

మ. ఒడలుప్పొంగు నొయారిఁ జూడ జపరాలొద్దన్ మెలంగన్ గగు
ర్పొడుచున్ ముద్దులగుమ్మ గంధకుసుమంబుల్ చేతి కందిచ్చున
ప్పుడు వ్యాపారము లన్నియు న్మఱచు నప్పూఁబోణి రాకుండినన్
గడెసే పొక్కమహాయుగంబుకరణిన్ గన్పట్టు రాచూలికిన్.

క. ఆనందబాష్పములచే, నాని వధూహావభావనటనలఁ దనలోఁ
దాన తలపోయువానికి, స్నానం బేమిటికి వేఱె జప మేమిటికిన్.

క. ఈరీతి నుండ నొక నాఁ, డారాజకుమారి యతని కాహార మిడన్
జేరి తదారామంబునఁ, గూరిమి నెచ్చెలులు వెంటఁ గొని తేరంగన్.

క. వెస లలనామణి బంగరు, వెస లల దొంతరలు డించి వినయము మది కిం
పొసఁగఁగఁ గంకణరవములు, పొసఁగఁగ నారసి రసాన్నములు వడ్డింపన్.

చ. చిలుకలకొల్కి వే యెడమచేముడి గొల్పెడుజాఱుకొప్పు నిం
పులుఁగులకింపు చుండుభుజమూలరుచుల్ జిలుఁగుంబయంటలోఁ
గులుకుమిటారిగబ్బిచనుగుబ్బలుఁ జూచుటెకాని క్రీడి క
ర్మిలి మఱి లేదు భోజనము మీఁదియపేక్ష యొకించు కేనియున్.

తే. రమణి యొయ్యారములపైఁ బరాకుచేతఁ
జవి యెఱుంగఁడు వడ్డించునవి యెఱుఁగఁడు
భోజనము సేసి లేచె నారాజసుతుఁడు
తృప్తి యేరీతి నుండెనో తెలియరాదు.

క. అపు డతిరయమునఁ బన్ని, రపరంజిపసిండిగిండియందుం గొని తాఁ
జపలాక్షి తెచ్చి యొసఁగం, గపటపుసన్న్యాసి ధౌతకరపంకజుఁడై.

క. నిర[illegible]చుండె జవ్వని వెనుకన్
బగడపుఁగంబపుఁజాటున, మొగ మించుక గానిపింప మురువు నటింపన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 7859

శా. కంగుల్ దీరినపైఠిణీఅవిక చన్గట్టంటె రాణింపఁగా
జెంగల్వల్ నెతికొప్పునందు నొఱపై చెంతం గుబాళింపఁగా
బంగారందియ ముక్కునం గమిచి పైపై నంచ యల్గింపఁగా
సింగారం బగుముద్దుఁ జిల్కతనకుఁ జేదోడు వాదోడుగాన్. 157

తే. ఏకతంబున వసియించి యిట్టులుండ
మదనమదనాగవలమాన మానసాంబు
రుహుఁడు పురుహూతసుతుఁడు నేరుపునఁ బలికె
నాచకోరాక్షిఁ గ్రేఁగంటఁ జూచి యపుడు. 158

తే. చెలువ నిను రాజకీరంబు చెట్టవట్టె, గలికి నిను రాజహంసంబు కాలుద్రొక్కె
మంచిశకునంబు లివిగొ నామాటఁ జూడు, కన్నె యీలోనఁ బెండ్లిగాఁగలదు నీకు.

క. అనవుడు లజ్జానతా, ననతామరస యయి వీరు నాఁగ మహాత్ముల్
తనసేసినసేనకుఁగా, మన మలరి వచించి రనుచు మది నుత్సుక యై. 160

తే. కురులు కెంపులబొగడల నెరయ దువ్వి
నిక్కుఁజనుగుబ్బలఁ బయంట చక్కఁ జేర్చి
పలికెఁ గలకంఠిమోమునఁ దెలివి దొలుక
ముత్తియపుముంగఱ యొకింత మోవిఁగదియ. 161

మ. అవుఁగా మీ రిట మున్ను గన్గొనినచాయ ల్లేవుగా నాఁటనుం
డి విశేషంబులు గొన్ని మిమ్ము నడుగన్ వేడ్కయ్యెడు న్నాకు నె
య్యవి గన్గొంటిరి పుణ్యభూము లట రాజ్యంబుల్ మనోజ్ఞంబు లె
య్యవి యేయేపురముల్ గనంబడియె మీ కందంద మార్గంబునన్. 162

క. మీరింద్రప్రస్థముఁ గని,నారా పాండవులఁ జూచినారా సుఖులై
వారందఱు నొకచో నున్నారా వీరాగ్రగణ్యు నరు నెఱుఁగుదురా. 163

సీ. ఎగుబుజంబులవాఁడు మృగరాజమధ్యంబు, పుడికిపుచ్చుకొను నెన్నడుమువాఁడు
నెతివెండ్రుకలవాఁడు నీలంపునికరంపు, మెఱుఁగుఁజామనచాయ మేనివాఁడు
గొప్పకన్నులవాఁడు కోదండగుణకిణాం,కము లైనముంజేతు లమరువాఁడు
బవిరిగడ్డమువాఁడు పన్నిదం బిడి డాఁగ,వచ్చు నందపువెన్నుమచ్చవాఁడు
తే. గరగరనివాఁడు నవ్వుమొగంబువాఁడు, చూడఁ గలవాఁడు మేలైనసొబగువాఁడు
వావి మేనత్తకొడుకు గావలయు నాకు, నర్జునుండు పరాక్రమోపార్జునుండు. 164

క. తడ వాయె భూప్రదక్షిణ, మడరింపఁగఁ బోయి యామహామహుఁడు పదం
పడి పుణ్యస్థలముల నెన్నఁడు మీ రందందు నరుఁ గానరు నా... 165

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అన విని సమస్తభూములు, గనినారము తీర్థయాత్ర గావించు నెడన్
గనుఁగొనినారము సంక్రందననందను ననిన ముద మెదం జెన్నొందన్.

ఉ. ఎచ్చటఁ గంటిరో విజయు నిక్కువ నిక్కువ మానె రాఁడుగా
యిచ్చటి కంచుఁ గోరికలు నీరిక లెత్త రసోక్తిఁ బల్కఁగా
నొచ్చెము లేనిబీర మెద నూరఁగ నూఱఁగ సాగె వెంటనే
పచ్చనివింటివాఁ డపుడు పైఁదలిపైఁ దలిరాకుఁ గైదువుల్.

ఉ. కోమలి యాగతి న్మదిఁ దగుల్పడఁ బల్కిన నవ్వి నిర్జర
గ్రామణిసూను మీ రెచటఁ గంటిరొ యంటివి కన్నమాత్రమే
యేమని చెప్పవచ్చు నొకయించుక ఖేదము లేక యాయనే
మే మయి యున్నవారముసుమీ వికచాంబుజపత్త్రలోచనా.

ఆ. తీర్థములను గ్రుంకి దేవతాసేవలు, చేసికొనుచుఁ బెక్కువాసరములు
గూడి యతఁడు మేము గోకర్ణమునయందు, నుంటి మనిన మచ్చెకంటి యలరి.

క. ఎక్కడ గోకర్ణం బన, నిక్కడి కది యెంతదూర మింతకు నతఁ డీ
చక్కటికి వచ్చునో లే, కక్కడనే యుండి యవలి కరుగునొ చెప్పుఁడా.

క. అని రాజవదన మాటికి, ననురాగము తేటపడఁగ నాడెడుమాటల్
విని జేజేరాకొమరుఁడు, వనజేక్షణ కసిరియె వలపు వడ్డికిఁ బాఱన్.

క. వేమారు గ్రుచ్చి గ్రుచ్చిపు, డే మీ వడిగెదవు మన సాకించుక నీ కా
భూమీశుమీఁదఁ గలదో, తామరసదళాక్షి నాకు దాఁపక చెపుమా.

ఉ. అక్కఱతోడ మంతనమునం దిటు వేఁడెదు గాన నెంతయున్
నిక్కము గాఁగఁ దెల్పెఁ దగు నీ కటులైన సురేంద్రసూతి యా
దిక్కున నున్నవాఁ డనుచుఁ దెల్పినతోడనె మాటలాడకే
యెక్కడఁ బోదువో యని యొకించుక సంశయ మయ్యెడుం జెలీ.

క. అకవ్వడి యతివేషముఁ, జేకొని యున్నాఁడు నీకుఁ జెంతనె యెన్నా
ళ్లో కలదు వచ్చి యింకను, నీకీలక మించుకైన నీ వెఱుఁగవుగా.

క. నీకై తపంబుఁ జేసెద, నీకై వడి దాఁపనేల యే నర్జునుఁడన్
లోకోత్తరశుభలగ్నం, బో కోమలి నేడు గోర్కు లాడఁగూర్పఁగదే.

ఉ. నా విని యావినీలకచ నవ్వుమొగం బటు గొంత వంచి యెం
తే వెఱ నివ్వెఱన్ మునిఁగి యాతనిఁ బార్థునిఁ గా నొకింత ముక్
భావమునం దలంచియును [illegible]
సేవ లొనర్చుచుంటి నని సిగ్గున సిగ్గున లేచి పోవఁగన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. ఏల పోయెదు నిలు నిలు బాల యనుచుఁ
జిలునగవు నెమ్మొగంబునఁ జెంగలింపఁ
దమకమున లేచి మరలేచి తత్కరాంబు
జం బొడిసి పట్టెఁ జే సాఁచి సవ్యసాచి. 177

క. పట్టినమాత్రనె దేవకి, పట్టికరాబ్జము లలాటపట్టిక చెమటల్
వెట్టె గగుర్పొడిచెం జను, కట్టొకయిసుమంత వీడెఁ గట్టుంగొంగున్. 178

క. మరుఁ డపుడు బేసితూపులు, ధరియించియు నేమి చెప్పఁ దరుణి న్నరునిన్
సరికోలలఁ బడ నేసెన్, గొరవంక రొదల్ చెలంగఁ గ్రొన్ననవింటన్. 179

క. ఆరీతిం జేపట్టి వ,రారోహన్ వేదిమీఁదికై రాఁ దిగువన్
దూరము వెస నరుగక యొ, య్యారముగా నమ్రవదన యై యుండంగన్. 180

క. ఏమును చూచి యెఱుఁగ నిను, నీమును ననుఁ జూచి యెఱుఁగ వీవును నిపుడీ
ప్రేమలు వినుకలి నేపై, పై మన కిర్వురకుఁ బర్వెఁ బర్వేందుముఖీ. 181

ఉ. శారికహారికంకణము సద్దున కంటుట గాదు కేలుమం
జీరఝుళంఝుళధ్వనికిఁ జేరుట గాదు పదంబు లంచవా
గ్ధోరణిమాధురీమహిమకున్ శుక మానుట గాదు చెక్కులో
సారసగంధి నాకొఱకు సాఁకెకు వేఁడెదుజాడ లన్నియున్. 182

క. చిలుకలకొలి కిది నాతోఁ, బలుకంగాఁ గొంత సిగ్గుపడియెదు మంజే
చిలుకా నీతో నైనను, బలుకంగా రాదె పలుకు బంగారఁటవే. 183

మ. రతికిన్ భారతికిన్ వినోదకథలం బ్రాగల్భ్యమున్ జూపి త
త్పతులం గూరిచి మటవాసిఁ గను పెద్దల్ గారె మీవార లా
చతురత్వం బిట గొంత గానఁబడ నీచంద్రాననన్ గూర్చి నన్
బ్రతికింపం గదె ముద్దుఁగీరమ సుధాబంధూభవద్గీరమా. 184

ఉ. చంపకగంధిమోవి సరసం బగుబింబ మటంచు పట్టితే
లింపు చెలుంగుతోఁ దమి దలిర్పఁగఁ బల్కినఁ జెక్కుగీఁటి ని
న్నింపున ముద్దువెట్టుకొని యెన్నఁడు మన్నన సేయ నున్నదో
పెంపుడుఁ జిల్క నిన్ను దనిపింతుఁ జుమీ చెలి నన్ను నేలినన్. 185

క. అని కేళిశుకముఁ బలికిన, మన మలరం గలికి వలికె మాటలతియ్యం
దన మింతం తనఁ గూడని, తనయధరసుధాసమగ్రతం దెలుపంగన్. 186

తే. మేరలా యివి మీయంతవారలకును, బెద్ద లున్నా రెఱిఁగి వార పెండ్లి సేయఁ
గలరు వేగిర [illegible] చిలుక. 187

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. అని యుచితరీతి వెలయఁగ నాడునాతి, రసికముద్రకు మిగులమానసము గర
వైపయిం బ్రేమ యగ్గలం బై పెరుఁగ, నవ్వధూటి నొడంబడ ననుఁ గిరీటి. ॥

క. మీవా తెలుఁగుట యెన్నఁడు, గావించుట యెన్నఁ డింకఁ గళ్యాణంబుల్
నీవేల జంపు నడపెదు, రావే మారాడ కిందు రాకేందుముఖీ. ॥

సీ. నన్ను గాంధర్వంబునను బెండ్లి యాడవే, సిగ్గేల పడియెదే చిగురుఁబోణి
రతిఁ దేల్చి మదనసామ్రాజ్య మేలింపవే, తల యేల వంచెదే జలజగంధి
చెలులు వచ్చెదరు నాతలఁపు లీడేర్పవే, తడ వేల చేసెదే ధవళనయన
మది నిచ్చగించి నామనవి యాలింపవే, కడ కేల పోయెదే కంబుకంఠి

తే. మనసు దాపంగ నేటికే యనుపమాంగి, చలము సాధింప నేటికే చంద్రవదన
ఘూటుఘూ టాడ నేటికే మధురవాణి, చింత సేయంగ నేటికే దంతిగమన. ॥

క. గబ్బిమగుం డొఱ వెఱుఁగక, గొబ్బునఁ బైఁ బడుగు నీవుఁ గూడనివార్తల్
సుబ్బినఁ గార్యం బెక్కడఁ, దబ్బిబ్బోఁ గాక పూర్వతనుబిబ్బోకా. ॥

క. మీఁదర్ వియోగసాగర, మీఁదర్ గల వాలతాంగి యే మెఱుఁగ వయో
యీఁదా డన్నను మదనుఁడు, కోఁదా డనువాఁడు బిగువు కొనసాగునొకో. ॥

క. ఏలే యాలేఖ్యాకృతి, యేలే ప్రాలేయకరముఖీ చూడ వయో
యేలే శైలేయ స్తని, యేలే శాలేందునిటల యే లాఁతినఁటే. ॥

సీ. ఆహార మిం పొకచ్చాగ్ర మానక యున్న, నాహార మింపుఁ గా దబ్జవదన
చెఱకువా లాదవువాతెఱ యానిచోఁ గంతు, చెఱకుఁబా లాదు నేచిగురుఁబోఁడి
కళలు దేరెడునెమ్మొగంబు ముద్దిడకున్నఁ, గళలు డేరవు సుమీ కంబుకంఠి
వలఱేనిదురమున నలరింప కున్నను, వ్వల రే నిదుర రాదు కలువకంఠి

తే. నేఁడు గాదు గదే ప్రేమ నీకు నాకు, నాఁటి యున్నది మదిఁ జిన్ననాఁటినుండి
యిటుల నేకాంతసమయ మెన్నఁటికి దొరకు, నేల తప్పించుకొనియెదవే లతాం

మ. అని బాహాపరిరంభసంభ్రమరసాయత్తైకచిత్తంబునన్
దను వీక్షింప నెఱింగి యందియల మ్రోఁతల్ గేకినుల్ రా సఖీ
జను లేతెంచి రటంచు వేమొఱఁగి హస్తంబుల్ విడం జేసి నే
ర్పునఁ దప్పించుక పోవ భూవరుఁ డసుం బూఁబోణికిం గ్రమ్మఱన్. ॥

క. కలహంస కేకిశుకములు, పిలపిల నేతేర నీవు పెంచిన వనిగా
త్రలఁ జెదవు మరుఁడు పైఁ గా, వలఁ బెట్టిన చెఱఁగి తిరుగు వనజాతముఖీ. ॥

క. షెల్లిద్దమ్మిక లున్నకొల్లఁకుల, యెలదెమ్మెర లాలయు వ్వాని సెగఁ బోయుచు న్నో
చెలి జొప్పని విరహులకుం, దలదిమ్ము ఘటించుఁ దుమ్మెదలది మ్మిచటన్. ॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. కలకంఠి నీకటాక్షము గల్గ నిన్నాళ్లు, మరుశిలీముఖముల సరకు సేయ
నళివేణి యాభిముఖ్యము గల్గ నిన్నాళ్లు, చందమామ నొకింత సడ్డ సేయ
రమణి నీప్రియవచనము గల్గ నిన్నాళ్లు, కలికి రాచిలుక లక్ష్యంబు సేయఁ
గొమ నీకరావలంబము గల్గ నిన్నాళ్లు, లేమావిచిగురాకు లెక్కసేయఁ

తే. జాడక మొగంబు ద్రిప్పి మాటాడ కిపుడు, చేదిగిచి పట్టుక పరాకు చేసినపుడె
రేమి పుట్టునొ కైలాట మింకమీఁద, మగువదయ లేక విడనాడఁ దగునె నీకు.

క. మొక మెఱుక గలదు గదవే, మకరాంకునియనుఁగుమేనమామకు నీకుం
దికమకలు సేయ వల దను, మకటా మేడపయి కేఁగునపుడైన చెలీ. 199

వ. అని యనేకప్రకారంబులం దనమనోరాగంబు తేటపడం బలికినఁ జెలుల నల యునెపంబునం బరాకు చేసికొని చిఱుచెమట క్రమ్మిన నెమ్మొగంబు మకరందబిందు కందళితారవిందంబుచందంబునం దనర నరవీడుకుచ్చిళ్ల నెత్తి చెక్కుచు నొక్కిం త జాఱుపయ్యెంటఁ జక్కం జేర్చుచు నొక్కింత పదలువేనలి నలవరింపుచుఁ గొం డొకచెదరుపాపటఁ గుదురుకొల్పుచుఁ జక్కెరవిల్తుం డెక్కడ వెన్నాడునోయను భయంబునంబోలె నించుకించుక తిరిగి చూచుచు ననుగతకేకిహంసంబులపై వె గటునంబోలెఁ జలించుచు నియ్యోళవు సకియలకుం జెప్పకుమని రాచిల్కకుఁ బ్రియం బుసెప్పుచు మగతేటి యంటియంటని ప్రసూనకలకపోలిక నరవిరిబాగుతో సోలికప్పు రంపుటనంటుల నంటుద్రాక్షపందిరుల తెరువులఁ బూదేనె కాలువలు దాఁటి చెంగ లువబావులడగ్గఱ కుంకుమనీటికేళాకూళియోరవట్టి పట్టివేళ్లచప్పరంబులనీడ క్రీడా భరం బీడిచికొని పోవ నివ్విధంబున. 200

క. అఘనునిఁ బాసి మంజీ,రాఘోషము మెఱయ నరిగె నతళ్లపురికిన్
వేఘనజఘనతళుక్కున, మేఘము నెడఁబాసి పోవుమెఱుపో యనఁగన్. 201

క. ఎటువంటినేర్పరి నిశా,విటునల్లుఁడు నడుమ నిల్పి వెడసింగిణిచే
నటు చూపిటు నిటు చూ పటుఁ, బటురయమున నేసె నాసుభద్రార్జునులన్. 202

తే. కోప మగువారి బెదరించి కూర్పనేర్చు, గూడమనువారిఁ దమి గొల్పి కూర్పనేర్చు
గొమ్మలకుమగలకుఁ బెండ్లి గూర్ప నేర్చు, జగతి నెంతటియుపకారి శంబరారి. 203

ఆశ్వాసాంతము

శా. దాక్షిణ్యాకరమూర్తి షోడశమహాదానాదిపుణ్యక్రియా
దాక్షా యాశ్రితదీనరక్షణకళాధౌరంధరీసత్కృపా
వీక్షా శాశ్వతకీర్తివైభవరమాభృచ్ఛ్రీశసింహాసనా
ధ్యక్షా దుష్టమరాట్టిరీటదళ[illegible]త్రేయకాత్రేయకా. 204

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. కలహారంభణకాతూ,హలపులకితభుజపరాక్రమార్జితనానా
జలదుర్గవనీదుర్గ, స్థలదుర్గాహార్య దుర్గసామ్రాజ్యనిధీ.

భుజంగప్రయాతము. అరాతిక్షమాభృద్భిదాంచత్కృపాణా
నరాధీశ్వరాకారనాళీకబాణా
స్థిరానందనారామసేవాధురీణా
విరాజచ్చతుష్షష్టివిద్యాధురీణా.

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధప్రసిద్ధసారస్వతసుధాసారజని
కోలతాంకూర చేమకూరలక్ష్మణామాత్యతనయ వినయధురీణ సకలకళాప్రవీణ
తేంద్రరఘునాథభూపాలదత్తహస్తముక్తాకటకవిరాజమాన వేంకటకవిరాజప్ర
తంబయినవిజయవిలాసం బనుమహాప్రబంధంబునందుఁ ద్వితీయాశ్వాసము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ

# విజయవిలాసము

## తృతీయాశ్వాసము



ధుర్యశౌర్యధైర్య
క్ష్మాధరమూర్ధన్య యాదిగర్భేశ్వర వి
ద్యాదికవితరణదీక్షా
రాధాసుత యచ్యుతేంద్ర రఘునాథనృపా. 1

తే. అవధరింపుకథాకర్ణనాతివేల, హర్షులైనట్టిదివ్యమహర్షులకును
తతసమస్తపురాణకథాశతాంగ, సూతుఁడై విలసిల్లెడుసూతుఁ డనియె. 2

క. ఆరీతి నంతిపురమున, నారీతిలకము సఖీజనంబులు గొలువం
జేరినపిమ్మట మదిలోఁ, గూరినపిమ్మట విరాళిఁ గొని నరుఁ డుండెన్. 3

తే. కృష్ణననుమతి రుక్మిణీకీరవాణి, వచ్చి భోజన మిడఁ దల వంచి యగ్గ
లంబయినచింత వలసి యొల్ల మి నతండు, సొగటులను బోయి కసిగాటులుగ భుజించె.

తే. మునుపు సైఁపదు సంతోషమున భుజింప, వెనుక సైఁపదు చింతచేతను భుజింప
బాలకడ నున్నయపు డెడఁబాసినపుడు, నొక్కతీ రయ్యె భరతవంశోత్తమునకు. 5

ఉ. ఎక్కడఁజప్పు డైనఁ దరళేక్షణ వచ్చె నటంచు లేచు నే
దిక్కున నల్కు డైన సుదతీమణిప ల్కని యాలకించు నే
చక్కిఁ దళుక్కుమన్న నలజవ్వని పై సిరి యంచుఁ జూచు న
మ్మక్క కిరీటిమోహసముదగ్రత నే మనవచ్చు నయ్యెడన్. 6

ఉ. చక్కరకెంపుమోవిఁ గని సారెకుఁ జిల్కమొగంబు వేఁడఁగాఁ
జొక్కపుఁజిల్వకప్పుజడఁ జూచి మయూరము లబ్బు సొఁపఁగాఁ
జక్కనితమ్మిపూ పదుగుజాడలఁ గన్గొని రాజహంసముల్
త్రొక్కుడుపాటు చెందఁగ వధూమణి వచ్చుట లెంచు నెమ్మదిన్. 7

తే. మారుతమ్ముల వాడికి మలయకూట, మారుతమ్ముల వేఁడికి మట్టుమీఱు
చంద్రకిరణమ్ములకు శుకశారికాళి, చంద్రకిరణమ్ములకుఁ జాల జలదరించు. 8

చ. విరహిణులం గలంపఁ గలవీరులు వీ రని తమ్ముఁ జేర న
య్యురుకుచవాలుఁజూపులకు నోడుట నంకము కౌఁగ ఖీనముక్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హరిణమునట్లనే తమళరాంశులు నోడనో కాక బాలికల్
గరఁపఁగ రాదె యేల ననుఁ గ్రాఁచెద రీమకరైణలాంఛనుల్.

క. ఇన్నాళ్లు సేవ సేయుచు, నున్నదియుం బోయె నేఁ డయో కౌఁగిలి యి
మ్మిన్నంతేఁ జదువఁ బెట్టఁగ, నున్నమతియుఁ బోయె నను టహో నిజ మయ్యెన్.

తే. అంతిపురమున కరుగుచో నింతి తిరిగి, యోరగాఁ జూచునపుడు శృంగారరసః
పారముగ నుబ్బ జాలెత్తె నారదాని, చలమనోహరలోచనాంచలమ చెలమ.

సీ. అర్జునుం డను నేసె యని తెల్పినంతనే, మిట్టిమీఁదై పడె మెలఁతచూపు
గాంధర్వమునఁ బెండ్లి కమ్మనునంత నే, పచ్చకప్పుర మయ్యె భామపల్కు
బలిమిమైఁ బట్టంగఁ దలకొనునంతనే, యొకబండి కల్లయ్యె నువిదపిఱుఁదు
సొలపుఁబయ్యెదఁ దేటి చూతు నన్నంతనే, పచ్చపూసాయెఁబో పడఁతియారు

తే. పేరు వివరించి నే నేల బేల నైతిఁ, గోర్కె యెతిఁగించి నే నేల గోల నైతి
బలిమిఁ బైఁ బడి నే నేల బయటఁ బడితి, బత్తి గనిపించి నే నేల పలుచ నైతి

సీ. తెలుప కస్తురిచుక్క దీర్చి వచ్చిన టెక్కు, గీఱునామము నాటితీరు గేరుఁ
దన్వంగి పలిపంబుఁ దాల్చి వచ్చినఠీవి, పన్నె గట్టిననాఁటిచెన్నుఁ దన్ను
వాల్గంటి కీల్గంటు వైచి వచ్చినచెల్వు, జడ యల్లుకొనునాఁటిసవురు జౌరు
నొయ్యారి మెఱుఁగుసొమ్మాని వచ్చినసీటు, మణిభూష లిడునాఁటిమట్టుఁ దిట్టు

తే. నాతిరాయంచగుమిగూడి నడుచుమురువు
చెలులు గొల్వంగఁ జనునాఁటి సొలపు నలఁపుఁ
జక్కఁదనములపోఁ వైనచంద్రముఖికి
నిచ్చలపురూపు లైసైనన నింపు నింపు.

ఉ. మిక్కిలి తేటిచూడ మిఱుమిట్టులు గొల్పుఁ జరించునప్పు డ
మ్మక్క దళుక్కునన్ మెఱసిన ట్లగు నే మన పచ్చ నద్దిరా
చొక్కపుఁ బైఁడిబొమ్మ యనుచున్ జను లాడిన నాడి రింతెకా
కెక్కడిదోయి పో యలమృగేక్షణమేనికి నక్కడానికిన్.

ఉ. చిత్తజుఁ డల్గి తూపుమొన చేసినఁ జేయఁగ నిమ్ము పై ధ్వజం
బెత్తిన నెత్తనిమ్ము పచియించెదఁ గల్గినమాట గట్టిగా
నత్తరళాయతేక్షణకటాక్షవిలాసరసప్రవాహముల్
కుత్తుకబంటితామరలకుం దలమున్కలు గండుమీలకున్.

క. అని తాల్మిఁ బాయు నేసుకు, నని యెప్పటివలెనె తిరిగి యరుదేర దాకో
యని [illegible] వచ్చెన్, సన్నుతోదరి నింక విధువ నని తలపోయున్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. విరహాగ్ని కోర్వక విధి దూఱుకొనెడు తాఁ, దపసివేషం బేల దాల్చినాఁడు
కడలేనిసెకలఁ గందెడుఘనోదయవేళఁ, దెలిసియుఁ దా నేల వలచినాఁడు
శుకశారికార్భటులకుఁ దల్లడిలెడుతా, నుపవనంబున నేల యుండినాఁడు
కరగతస్వామ వోవుకరణిఁ జింతిలెడుతా, వెలఁది నేటికిఁ బట్టి విడిచినాఁడు
తే. నేరముల నెంచెద మటన్న నేరికైనఁ, గలవు పరికించి చూడ వందులకు నేమి
యంగసాంగత్యపారవశ్యమునఁ గాక, యెఱిఁగి యుండిన నతఁడు చేయేల విడుచు.

తే. ఉనికి శృంగారవన మఁట యొంటిఁ దగిలె
నఁట విరహి యంట యెంత సేయఁడు కిరీటి
నసమశరుఁ డింకఁ దన వైరి యగులలాట
లోచనుని గెల్చు నని దయఁ గాచెఁ గాక. 18

క. ఇటు లాతఁ డుండఁగా న, క్కుటిలాలక యంత నచటఁ గుసుమశరార్తిన్
బెటిలిపసిడి పాన్పుపైన, ట్టిటు వడి తనలోనఁ దాన యేకాంతమునన్. 19

క. ఏఁ గోరినచెలువుఁడె నను, దాఁ గాఁపలె నంచు వచ్చి దగ్గఱి వేఁడం
గౌఁగిలి యీ కిట వచ్చితి, నోఁ గా దని పెనఁగి యెంత యవివేక మయో. 20

ఉ. దిగ్గున లేచి నన్నతఁ డతిప్రమదంబునఁ జందమామ జా
నిగ్గుటరంగుమీఁదికయి నెమ్మిఁ గరాబ్జము వట్టి యీడ్చినన్
బిగ్గఁ గవుంగిలించి సుఖనీరధిఁ దేలఁగ నీక నా కయో
సి గ్గను పేర వెంటఁ బడఁ జెల్లు నొకో ప్రతిబంధ మయ్యెడన్. 21

క. తొల్లిటివలె సేవకుఁ బోఁ, జెల్లునె మావారు పెండ్లి సేసెద రదిగో
నెల్లిఁ దమ కంచుఁ బలికితి, నెల్లిద మగుఁ గాదె తిరిగి యేఁ బైకొన్నన్. 22

సీ. ననుఁ దా వలచిపడ్డనలకువల్ దీరంగఁ, గైసేయ నెన్నఁడు గలుగునొక్కొ
పెనఁగి చే విడిపించుకొనిన నేరమి పోవఁ, గెలన నెన్నఁడు నిల్వఁ గలుగునొక్కొ
ప్రియ మెఱుంగక యడ్డపెట్టుతుందుడుకు వోఁ, గల్యాణ మెన్నఁడు గలుగునొక్కొ
మోహతాపము దీఱ మోవిచక్కెరపానకమున నెన్నఁడు దేల్పఁ గలుగునొక్కొ
తే. యొంటి శృంగారవనములో నునిచి వచ్చి, నట్టినెంజిలియెల్ల వో నాన్పపాల
తిలకుఁ జేర్పంగ నెన్నఁడు గలుగునొక్కొ, యాముకవిసినకుచకుంభసీమయందు. 23

క. అని యెంచరానికోర్కులు, మనమునఁ దలపోసి భావమగ్నతచేతం
గనుమూయుఁ గలసినట్టులు, గని సంతస మందుఁ దెలిసి కళవళ మందున్. 24

సీ. ఉదయాద్రి యెరగలి నొరపి మీఁద వెలుఁగు, జలజారి వేఁడివెన్నెలలు గాయ
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
హరుకంటిసెగ కోర్చి యాటి తేటినమాఁరుఁ, డలరుఁ జిచ్చుఱవాఁడిములుకు లేయ

బాముకోలలతోడ సాము చేసినగాడ్పు, విసపువిత్తై సోఁకి వెగటు చూపఁ
గ్రౌంచాచలముపోటుగంటి దూరినరాజ,హంసము ల్వడి హాళాహళులు సేయ
తే. వేగునంతకు వలవంత వేఁగునంత, నంతిపురమున బ్రమదవనాంతరమునఁ
'గృష్ణకృష్ణా!' యటంచు నాకీరవాణి,'రామరామా!' యటంచు నారాజసుతుఁడు.
క. చెలులు ప్రసంగవశమ్మున, నలరెం గడువిజయభసన మనిన న్నవలా
దెలియ వినుం గలయఁ గనుం, బలుమఱు బా గౌఁ గిరీటిపచ్చ లటన్నన్. 26
క. మనమున నున్నది మొగమునఁ, గనిపించుం గాన గట్టిగా మదిలో న
ర్జునభావ మునికి నపు డ,ర్జునభావము మొగమునందు సుదతికి నిల్చెన్. 27
సీ. పులకించె మే నేమి తలఁచుకొంటివె యంచు, మేలంబు పచరించె మిత్రవింద
యిన్నాళ్లవలె మన సిచ్చి మాటాడవే, యెందు దృష్టి యని కాళింది దెగడెఁ
జెలి పెండ్లికతఁ జెప్పఁ జెవి యొగ్గి వినవేమి, కలదు లే యని గేలి సలిపె భద్ర
వలపువాసన మించెఁ గలికి నీమొగ మంచుఁ, ద్రస్తరి నెఱపె సుదంతి కొంత
తే. జాంబవతి నవ్వె లక్షణ సరస మాడె, నేలగడు సేసెదరె ముద్దరాలి ననుచుఁ
బలికె రుక్మిణి సత్య క న్గిలిపె నపుడు, చిన్నిమఱఁదలిమోహంపుఁజిన్నె లెఱిఁగి.
క. అంగన యిన్నాళ్లును ముని, చెంగటికిం బాటిపాటి సేవలు గావిం
పంగా బోదువు నేఁ డటు, తొంగియుఁ జూడ వతఁ డేమి దోసము సేసెన్. 29
ఉ. అక్కఱఁ జూడ వేటి కల యచ్చిక బుచ్చిక సేయు నంచలం
జెక్కిలిగొట్టె దేమిటికిఁ జేరఁగ వచ్చినముద్దుఁజిల్కలన్
ముక్కుమొగంబుఁ జూడ కటు మ ట్టను బొ మ్మనె దేల బోట్ల నో
చక్కరబొమ్మ నీవెగటుజాడలఁ జూచిన వింత లయ్యెడున్. 30
ఉ. ఎవ్వనిఁ జూచి మేలుపడితే యరవిందదళాక్షి నీమనం
బెవ్వఁడు సొచ్చెఁ జెప్పఁగదవే మదకోకిలవాణి నిన్న నేఁ
డెవ్వనిచెల్వు నీయెదుట నెన్నఁ బడెన్ వినతాంగి నేనె కా
కెవ్వరు నీకుఁ బ్రాణసద మేటికి దాఁచెదవే తలోదరీ. 31
ఉ. బాలసమీరణంబు పయిపాటువ నించుక సోఁకినం గడుం
దూలుచు నుండుఁ గా నల వినోదపుసుద్దులముద్దుఁజిల్కపై
వ్రాలినఁ గందుఁ గేలు పువువంటిది నీనునుమేని దేగతిం
దాళు నయో వియోగశిఖి దా నెదలోఁ దరికొఁ దలోదరీ. 32
క. అని హారికి వారందఱు, మనమున దోఁచినటు లాడుపుచ్చికవారల్
విని సిగ్గున నయ్యలజ,వ్వని యూరక యున్నపుడు వారలలోనన్. 33

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. లెంకఁగ నేలుకోఁ గలదులే మగనిం దరితీపు సేసి మీ
నాంకునిపాద మాన మన మాదట వేఁడిన మాఱు పల్కఁగాఁ
గొంకెడు నంచు మీ రిపుడు గోలని చూడకు రమ్మ నేర్పుఁ బో
చంకలబిడ్డ లూడిపడ సారసలోచన మాటలాఁడఁగన్. 34

తే. క్రాఁగి యున్నది మిగుల నంగంబు చూడఁ, గలవరించుచు నున్నది కలదొ యేమొ
సోఁకు డల్లసన్న్యాసికే చూపవలయు, భామ నని పల్కె నాసత్యభామ నగుచు. 35

క. ఈలీల నుండి మన మిటు, మేలము లాడంగ నేమి మిడిమేలమొ యం
చాలో సత్య సుభద్రహి, తాళుల కిసుమంత యారహస్యముఁ దెల్పెన్. 36

క. గుసగుసలఁ బోయి వలపుల, కిసమస లని తెలిసి రసికకిసలయపాణుల్
బిసకిసలకుసుమవిసరము, వెసమసలక తెచ్చి శిశిరవిధిలాలస లై. 37

శా. పన్నీటన్ జలకంబు లార్చి చలువల్ పైఁ గట్టగా నిచ్చి మే
న న్నిండారఁగఁ జందనం బలఁది విన్నాణంబుగాఁ గప్పురా
న న్నామం బిడి క్రొమ్ముడిన్ విరిసరంబుల్ నించి హారావళుల్
చన్నుంగ్రేవలఁ దార్చి రప్పుడు చెలుల్ చంద్రాస్యకు న్నేర్పునన్. 38

సీ. బోటి మధువ్రతంబులకు దండము వెట్టె, మకరంద మధరబింబమునఁ జిల్కెఁ
జెలి గంధవహున కంజలిఁ జేసి నెత్తావి, పువ్వుగుత్తు లురోజమున నమర్చె
నాళి బిసాహారపాళికిఁ బ్రణమిల్లి, నవమృణాళములు బాహువులఁ గూర్చె
సకి గెందలిరుదిండులకు వందన మొనర్చి, చిగురుటాకులు పాదయుగళిఁ జేర్చె

తే. సరగ నిటు లందఱును మీప్రసాద మనుచుఁ, బంచసాయకదేవతాబలము నెల్లఁ
వేఁడికొని తగినట్లు కావించి రపుడు, చంచలాక్షికి శిశిరోపచారవిధులు. 39

తే. కలయఁ బన్నీరు చిలికి శ్రీగంధ మలఁది
విరులు పైఁ దార్ప నపు డొప్పెఁ దరుణిమేటి
మగని నరు గెల్వ నలరాచమాసటీఁడు
పూజ నేసినయగ్గజరాజ మనఁగ. 40

ఉ. అంగనగుబ్బచన్నుఁగుటందపు మేలిపసిండికుండలం
బొంగఁ దొడంగ జొబ్బిలఁగఁ బూసినగంధము తాపవహ్ని సం
పంగికటారినీరునకుఁ బాలును బియ్యము లేనిపొంగలో
పొంగ లటంచు నయ్యలరుఁబోఁడులు సారెకు నేలి నేయఁగన్. 41

పంచచామరము. [illegible] CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
గుబింగట న్నిలంగరాక కూర్మి వెచ్చ హెచ్చఁగాఁ

దుఱింగలించుచింతతోడ దూతి పల్కె రంత వే
మఱుఁగ మఱుఁగ మరున్మృగాంకమత్తకోకిలాదులన్. 42

క. విరివింటివాఁడవు గదా, శరణాగతులైనపాంథజనులను రక్షిం
తురు గాకిటుల నుపేక్షింతురె పైకము గూడఁ బెట్టఁ దొడఁగుచు మదనా. 43

క. అలరువిలుకాఁడ నమృతము, చిలికెడు నెల యేల సామిచేఁ గాచె వియో
గుల నేచఁగ విండ్లమ్ములు, గలవారికిఁ దోడు చల్లకడవలవారే. 44

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనివాఁడవు గాన నీకె నా
చక్కనివారిఁ జంద్రుని వసంతునిఁ గూరుచుకొంటి వందమా
జక్కరవింటిరాజ యెకసక్కెమదే మని కూర్చుకొంటి న
మ్మక్క యరూపకం బయినయాయెలదెమ్మెర నాలిబూతమున్. 45

తే. రమకు నట్టింటిపగవాఁడు కమలవైరి, కంసుఁ బోలినయుగ్రశేఖరుఁడు వాఁడు
మేనమామని చూడకు మాను చెలిమి, యకట పైవచ్చు టెఱుఁగవే హరికుమార.

క. తరుణిమయి తావి యాసునఁ, బురికొల్పెడునిన్ను గందపుంగొండ యిటుల్
పురికొల్పెనె తానుం దా,మరకొలఁకులరమయ మలయమరుదంకురమా. 47

క. తెమ్మెర నీకెం తెమ్మెర, గమ్మనివిలుకానిదొరవు గమ్మవి నెలఁ బై
రమ్మని యలిపికశుకనిక, రమ్మనిగా నిలిపి ముందరగ వచ్చితివా. 48

పంచచామరము. జొహారు మీకుఁ జల్లఁగాఁగఁ జూడుఁడో సమీరకం
జహారులార మంట మాని శంబరారిఁ గూడి యీ
గొహారు సేయ నేల యీచకోరలోచనన్ భుజం
గహారుపాద మాన మీకుఁ గాఁక లింకఁ రేఁచినన్. 49

క. వల పెక్కడ లేదా యీ, యలికుంతలతలనె వేగ నాయేఁచ కికం
జలికాలఁ ద్రోచి విడువుము, చెలి మిక్కిలి మనసుపేద శీతలపాదా. 50

చ. శివుఁ డిటు రమ్మటంచు దయ చేసినచోఁ దల కెక్కె తుగ్రవై
భవమునఁ జూచుచో నడుగు పట్టితి వే మన వచ్చు నీగుణం
బవు నవు నందినన్ సిగయు నందక యున్నను గాళ్లఁ బట్టుకొం
దువు హరిణాంక వేలకొలఁదుల్ గద నీనడకల్ దలంపఁగన్. 51

తే. కలశవారాశిఁ బుట్టుట కప్పెనయుట, శైలచాపశిరోధివాసంబుఁ గనుట
యెవ్వరికి నంటరాకుంట యెఱిఁగి కాల, కూట మన నేమి ననుఁజంద్ర నేఁటనుండి.

తే. భువనజాతాకరమారి నవ్వుట కదలి కదలి [illegible] కొక్కటిగ నెంచి
త్రాగుతలఁబోసికొమ్మని వేగ హరున, కిచ్చె నీరుచి యిఁక నెంచ నేల చంద్ర. 53

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. చక్కెరవింటిరాజు నగచాపునితో నెదిరించి పడ్డనాఁ
డెక్కడ నుంటి వీవు మధుఁ డెక్కడ నుండెను మందమారుతం
బెక్కడ నుండె సిగ్గు వడ రే మిపు డాతఁ డదృష్టరేఖచే
దక్కొని క్రమ్మఱం బ్రతికి రాఁగ పజీర్ణయినారుగా శశీ. 54

క. మాకలకంఠియు నీవును, నేకగ్రీవముగ నుందు రిన్నాళ్ళు నయో
కోకిల యిపు డేల లలఁచెదు, నీ కగునే యిగురుఁబోఁడినెత్తురు ద్రావన్. 55

క. కొమ్మపయి పత్త్రపాతము, నెమ్మెయి నెఱపుచు విదేల యేఁచెద వకటా
కమ్మఁగ నవాతుచక్కెర, క్రమ్మఁగ మా టాడుతవర కలకంఠవరా. 56

ఉ. కల్లరి త్రాఁచు నిప్పుకలు గైకొను కేకి చకోరపాళికిం
జెల్లినఁ జెల్లుఁ గాక సరసీజబిసంబు లిగుళ్లు మేసి భా
సిల్లెడుమీ కయో విషము చిల్కఁగ వేఁడమి గుల్కఁ బల్కఁగాఁ
జెల్లునె యోమరాళపిక శేఖరులార వచింపుఁ డింపుగన్. 57

క. రాచిలుకా కోమలిదెసఁ, జూచితె శ్రుతికటువు లనెడుశుకనామము మీ
కేచాడ్పునఁ దగు వల దిఁక, మా చెలిఁ గెరలించి తేని మాటలు వచ్చున్. 58

క. మననగుణం బని చాలఁగ, మది నమ్మితి మిట్లు మొరయ మరియా దగునే
యదియును గాక మదాళులు, గద తుమ్మెదలార వెగటుగా నాదెదరే. 59

వ. అని బహూకారనికారమమకారచమత్కారంబులు గానంబడ నీప్రకారంబున. 60

క. శరదబ్జముఖులు మాటికి, శరదబ్జముఖుల్ దలంపఁ జాల్ నిలుఁ డంచుం
దరుణీమణి వేసరి యా, స్తరణసుమామలను జూపి తాపముచేతన్. 61

సీ. ఈ క్రొవ్విరులు గ్రోలు నెలతుమ్మెదలు చెక్కు, చెమరింప కున్నవా చిగురుఁబోఁడి
యీ కెంజిగురు మెక్కు కోకిలానీకముల్, వసివాడ కున్నవా వనజగంధి
యీ నిండువెన్నెల లానుచకోరముల్, గసుగందకున్నవా కంబుకంఠి
యీ తూండ్లు భుజియించుజాతియంచలు సొట, సొటలు వోకున్నవా శోభనాంగి
తే. తెలిసి రా రమ్మ కలదు సందియము చాల, నులికి పడ కవి లెస్సలై యుండెనేని
వజ్రకాయము లే యౌను వానికెల్ల, నపుడు విరహులయవధికి నవధి లేదు. 62

క. చలిగాలి గర్వ మణఁపం, గలిగెం జిలువ లని యుండఁగా వానిపయిన్
గలిగె శిఖావళము లయో, చెలి తప్పు లె వాయుసఖము శిఖి యనువార్తల్. 63

తరల. అగము లెక్కుచు మిన్ను ముట్టు చహంకరించుబలంబుతో
మృగమదంబు నడంగఁ జేయుచు మేనికప్పు చెలంగఁగాఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బగలు మీఱఁగఁ బాంధకోటుల బాధ వెట్టుచు నుండు నీ
లోఁగ తగుల్ వెడవింటిబోయకుఁ దోడు వచ్చినవాఁడపో. 64

క. మకరందరసముఁ జిల్కొ-డు, చికిలిలకోరీలు చెఱకుసింగిణివిల్లుం
బ్రకటించియు నిది యేమో, మకరాంకుఁడు చేదువగలు మానఁడు చెలియా. 65

చ. ఛిడిముడిపాటుతోఁ జెఱకుసింగిణిఁ బూని మధుప్రియత్వ మే
ర్పడుగతిలావు లున్నహరిపైని జివుక్కున నెక్కి యుక్కునన్
వెడలెడుచందుఁ జూచి తమి నేఁ డిదిగో సధ మాచరించుఁ బెం
పడరి లతాంగి పచ్చితురకాఁ గద యమ్మదనుండు చూడఁగన్. 66

తే. అనినఁ బసనుండు మనకు లోనైనవాఁడు, తోయజారాతిమనుజులత్రోవ రాఁడు
కాముతూపులు వెండ్రుకఁ గట్టఁబడును, జామ యేటికి నూరక జలదరింప. 67

తే. అనుచు నూఱడఁ బల్కి తత్ప్రాణసఖులు, దేవకీదేవి కీమాట దెల్ప కున్నఁ
గా దనుచుఁ జేరి చెలియున్నగాద దెలిపి, రంత యటమున్న తెలిసి మురాంతకుండు.

ఉ. తల్లిని దండ్రి నాత్మజులఁ దమ్ముల రమ్మని యేకతంబునం
దల్లకిరీటి యున్న తెఱఁ గందుసుభద్రకు నైనమోహముం
జెల్లము సేసి మున్ మనమదిం గలయట్లనె యయ్యె నంచు రం
జిల్లి హలాయుధుం డెఱుఁగఁ జేయఁగ రాదు గదా వివాహమున్. 69

క. తనశిష్యుం డని దుర్యోధనునకు నీవలచి సమ్మతం పడఁ డటు గా
వున నిందుకుఁ బశుపతిపూజన మని యొక టిపుడు గద ప్రశస్తం బయ్యెన్. 70

చ. ఇరువదినాళ్లు రేపు మొద లిందుధగోత్సవలీల లచ్చటన్
జరిగెడు నేఁటి కెన్మిదవనాఁటికిఁ బెండ్లిముహూర్త మవ్వధూ
వరులకుఁ జెప్పి సల్పుఁడు వివాహవిధుల్ హాలి గానకుండఁ దీ
వరమున లగ్నవేళ కిటు వత్తు నటంచు నమర్చి దేవకిన్. 71

క. అంతటఁ బశుపతిపూజకు, నంతటఁ జాటంగఁ బనిచి హరి యరిగెఁ బ్రలం
బాంతకు వసుదేవుని ము, న్నంతర్ద్వీపమున కేఁగు మని యావెనుకన్. 72

క. యదువృష్ణిభోజకులజులు, గదలి రపు డనేకబాలికామణిభూషా
మృదులపరిధానపరిమళ, విదితమహైశ్వర్యధుర్యవిభవోన్నతులై. 73

ఉ. ఈగతి నంతరీపమున కెల్లజనంబులతోడ నేఁగి యం
దాగమవేద్యశాలికి నతామరపాళికి నిందుమాళికిం
ద్యాగము భోగముం జెలులయాటలు పాటలు నిత్యకృత్యమై
సాగఁగఁ జూచ్చు చుండి రల శౌరియు సీరియు సంభ్రమంబునన్. 74

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. అంత నిచ్చట ద్వారకయందు దేవ,కీసతీమణి తాను రుక్మిణియుఁ బెండ్లి
పెద్దలై యర్జును సుభద్రఁ బెండ్లికొడుకుఁ, బెండ్లికూఁతునుఁ జేయ నపేక్షఁ జెలఁగి.

ఉ. కట్టిరి మంచిలగ్నమునఁ గంకణముల్ కరపంజరంబులం
బెట్టిరి మేనుల న్నలుఁగు మేలిమృగీమదకుంకుమంబులం
జుట్టిరి కైశికంబుల విశుద్ధమశోకదళపుష్పమాలికల్
పట్టిరి పేరఁటాండ్రు ధవళంబులు పాడుచు నుల్లభంబులన్. 76

శా. ఇన్నాళ్ళొప్పిది యొనర్పఁ గేళివనిలో నిం పొందు నమ్మాధవీ
పున్నాగంబుల పెండ్లి సేయవలెఁ బూఁబోండ్లార రాగే యటం
చున్నేర్పుల్ దగ నొండొరుం బిలిచికొంచుర్ సత్యభామాదివి
ద్యున్నేత్రామణు లప్పు డిర్వురకు విందుల్ సేసి రందందులన్. 77

క. అంతర్వాణి పురోహితుఁ, డంత వివాహోచితక్రియాకాండం బా
ద్యంతము గావించుట కై, సంతసమునఁ జేరి యున్న సమయమునందున్. 78

క. సంపంగినూనె యంటెర్, శంపాంగి కిరీటి కొకతె చనుదోయి పిసా
లింపం గీల్జడ కటి నటి,యింపర్ గిటగిటని కా నొకింత చలింపన్. 79

క. కలశస్తని మణికంకణ, కలశస్తని నాద మొలయఁగా నొకతె వడిర్
దలఁ బ్రామి పసిఁడికొప్పెర, జలములు చెలు లంది యొసఁగఁ జలకం బార్చెన్. 80

లయవిభాతి. చలువ లొసఁగెర్ సరగఁ జెలువ యపు డొక్కరితె
వలఁతితన మొప్ప నొకపాలఁతి తడి యొత్తెర్
గొలఁది గజవాది నొకవెలఁది తలఁ బూసె నొక
జలరుహదళాక్షి సిగ కలరుసరి చుట్టెర్
దిలక మిడియె న్నిటలఫలకమున నొక్కరితె
తెలి నిలువుటద్దమొక చెలి నిలిపె మ్రోలర్
గలయ జవరా లొకతె మలయజ మలంచె నొక
లరన విసరెర్ సురటి యలనరున కర్థిన్. 81

తే. ఓరగవేసినసిగ వింత యొఱపుఁ జూచి
ఓవిరి దిద్దినచెంపలబాగుఁ జూచి
వడి గొలిపి యున్న మీసము బెడఁగుఁ జూచి
యపుడు తమలో సుభద్ర నెయ్యంపుఁ జెలులు. 82

క. వాసవి త్రిదండివేసము, వేసి గదా మేలు నేసె వెస జన్నిదమే
వేసికొనవచ్చు నసిన, వేసికొనం గూడ దొండువేసము లైనన్. 83

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. దండము కాషాయంబును, గుండికయును మాని పెండ్లికొడుకై నాఁడా
ఖండలుని ముద్దుఁగొడుకు ప్రచండరుచి న్నేఁడు మంచిసన్న్యాసముగా. 84

మ. యతివేషంబున నిన్నినాళ్లు మనయుద్యానాంతరక్షోణి ను
న్నతఁ డా యీతఁ డదేటిమాట కనుఁగోమం దెన్నఁడే నీతను
ద్యుతి యీరాజస మీ మొగంబుకళ లీయొయ్యార మీవీక్షణా
మృతలీలాభినయంబు లీసొగసు లీమీసాలలో నవ్వులున్. 85

క. ఈమహిమ యెందుఁ గలదే, భూమండలిలోన నితఁడె పో చక్కనివాఁ
డోమగువలార మును విన, మా పన్మథు నతనిమేనమామ న్మథునిన్. 86

క. ఈరాజుసేవఁ జేసిన, వారిది గద భాగ్య మీభువనమోహనశృం
గారునితోఁ గూడం గల, నారీమణిదే సుమీ జనన మూహింపన్. 87

తే. మంచిమగఁడు వలయు నంచుఁ గోరుచు నుండ
మంచిమగఁడు గలిగె మఘవసుతుఁడు
మనసుభద్ర సుకృతమహిమ యే మనవచ్చు
మనసు భద్ర మయ్యె మనకు నెల్ల. 88

తే. అని నుతింప నలంకృతుఁ డగుచు గొంతి, కూర్మికొడు కుండ బంగారుకుండ యైన
కన్యకారత్నమున కాప్రకారమునసె, శిరసుమజ్జన మొనరించి చిగురుఁబోండ్లు. 89

ఉ. భామకుఁ గప్పుదేరు తెగబారెఁడునిద్దపుసోగవెండ్రుకల్
వేమఱు దువ్వి భారమున వెన్కకు జాఱఁగఁ గొప్పు వెట్టనో
హో మఱి వేయువెట్టినటు లొప్పె నదే మనవచ్చు నాఁ గదా
తామరసాక్షి కెంపుఁ దలిదండ్రులు వెట్టనిసొమ్ము పెన్నెఱుల్. 90

క. స్వకపోలకల్పితమనో,జ్ఞకళాగతి కెట్టు లౌను సరి ఛాయాచో
రకరుచిసందర్భం బని, ముకురము నగుకరణి నవ్వుమోము చెలంగన్. 91

ఉ. అద్దము చూచి చంద్రముఖి యందముగాఁ దిలకంబు కస్తురిన్
దిద్ది యనేకరత్నమయదివ్యవిభూషలు దాల్చి యయ్యెడన్
ముద్దులు గుల్కు కుందనపుముక్కలిపీఁట వసించెఁ దమ్మిపూ
ముద్దియ గద్దియం బొలుచుముద్దియ యొద్ది యనన్ శుభోన్నతిన్. 92

చ. తనయునిపెండ్లి కేఁగవలె ధాత్రికి దిక్కులవారి నెల్లఁ దో
డ్కొని చనుదెమ్ము నీ వని కడుం గుఱి సేసి సురాధినాథుఁ డ
వ్వనపతి కంపినట్టిశుభవార్తల బంగరుఁగమ్మచుట్ట నా
దినకరమండలం బపరదిగ్గిరి [illegible] 93

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. నందకుమారానుజ యగు, తం దననందనుఁడు గట్ట దైవతపతి వే
డ్కం దెచ్చు తాళిబొట్టనఁ, జందురుఁ డరుణరుచిఁ బ్రాగ్దిశం గన నయ్యెన్. 94

సీ. కులదేవతను దెచ్చి నిలిపిరి మాణిక్య, చకచకల్ గల పెండ్లిచవికెదండ
నైరేనిఁ గొని వచ్చి రైదువల్ పాటలు, పాడుచు శుభవేళ వేడు కలరఁ
బులుకడిగినముత్తెముల బాసికంబులు, సరవిఁ గట్టిరి నేర్పు సంఘటిల్లఁ
దలఁబ్రాల కేర్చి ముక్తామణుల్ నించిరి, పసిఁడిపళ్లెముల సంభ్రమము మీఱఁ
తే. బణవశంఖధమామికాపటహకాహ, ళారవంబులు నెఱపిరి బోరు కలఁగ
సకలవినియోగములజనుల్ సకులె గాఁగ, నంతిపురమున నుత్సవం బయ్యె నపుడు. 95

తే. తడవు సేసె ముహూర్తంబు దగ్గఱించె, నే మొకో యన్న రాఁడనియెదురుసూడఁ
దనదుగారాబుఁజెలియనిమన నెఱింగి, మాటలోపల వచ్చె నమ్మాధవుండు. 96

క. ఒక రొకరి నెఱుఁగ కుండఁగ, నొకరివెనుక నొకరు వచ్చి రొక నెపమున నా
నకదుందుభిసారణసా, త్యకులును బ్రద్యుమ్నసాంబు లక్రూరాదుల్. 97

క. హరి వచ్చునంతలో నా, హరియుం జనుదెంచెఁ దనయుఁ డాత్మఁ దలంపఁగ
సుర లచ్చరలు మహర్షీ,శ్వరులు నరుంధతియు గురుఁడు శచియును దానున్. 98

ఉ. చక్కరవింటిరాజు నెకసక్కెము లాడఁగఁ జాలు నెక్కుడుం
జక్కఁదనంబు గల్గు నెఱసాహసపుంగొమరుండు మ్రొక్కఁ గా
నక్కనఁ జేరి మే నివిరి యాదల మూర్కొని చొక్కు చుండె లో
నెక్కొను వేడ్క నిక్క చెవి నీలని నెక్కపజీరుఁ డయ్యెడన్. 99

మ. సుముహూర్తం బిదె లెం డటంచు గురుఁ డచ్చోఁ దెల్ప దేవేంద్రుఁడుం
దమదేశంబున నుండి తెచ్చినసువర్ణక్షౌమకోటీరము
ఖ్యమణీభూషలతోడ బాసికము సింగారించి మందారదా
మము కంఠంబునఁ జేర్చి పెండ్లికొడుకుం బ్రాగ్దంతి నెక్కించినన్. 100

వ. అయ్యవసరంబున. 101

సీ. ఉపరిభాగనిరంతరోన్నమితము లైన, ముత్యాలగొడుగులమొత్త మలర
నుభయపార్శ్వముహుర్ముహుశ్చాలితము లైన, వింజామరలకలాపుంజ మమరఁ
గళ్యాణవైభవకర్ణేజపము లైన, తూర్యనాదములచాతుర్య మొనరఁ
బృథులప్రదక్షిణార్చిర్మేదురము లైన, దివ్వటీలసమష్టి నివ్వటిల్ల
తే. నపుడు ప్రద్యుమ్నుఁడు జయంతుఁ డివల నివలఁ
బసిఁడిబెత్తంబులను బరాబరులు సేయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నడచి యిచ్చిరి హరిపురందరులు ప్రోల
సంభ్రమంబున మందహాసంబు దొలుక. 102

చ. అనిమిషభావ మీసమయమందు ఫలించె నటంచుఁ గోరికల్
వెనుకొనఁ బైనపైన పడి వే తటకాపడి యుర్వశీవిలా
సిని మొదలైనయచ్చరలు చెంతలఁ జేరి సహస్రదృక్తనూ
జునియెడ లెల్లఁ గన్నులుగఁ జూచిరి మానసముల్ గరంగఁగన్. 103

ఉ. దేవకియింట నుండి యిటుదీర్ణతఁ బెండిలికూఁతు రున్నభో
జావనిజానిజానిజగృహాంగణసీమకు నేఁగి యెంతయున్
ఠీవి ఘటిల్ల సాత్యకి వడిం గయిలా గొసఁగం గిరీటి యై
రావతమున్ డిగెన్ ద్విజపురంధ్రులు ముత్తెపుసేసఁ జల్లఁగన్. 104

తే. నరవరోత్తముఁ డటు శుభోత్తరముగాఁగఁ, గుడిపదముమున్నగా నిడి కడపదాఁటి
యారతు లొసంగ దీవన లావహిల్లి, మోదమున నేఁగెఁ గళ్యాణవేదికడకు. 105

శా. శ్రీరంజిల్లఁ బసిండి పెండ్లిచవికం జేరంగ నవ్వేళఁ గ
న్యారత్నంబును దోడి తెచ్చిరి జనానందంబుగాఁ బాడుచున్
బేరంటాండ్రురుమంత్రవర్ణపఠనాప్తిన్ గర్గుఁడున్ దేవతా
పౌరోహిత్యధురంధరుండు శుభమొప్పన్ ప్రోల నేతేరఁగన్. 106

క. మెత్తుముగదె మన మెపుడుఁ ది, లోత్తమచక్కఁదన మీతలోదరియెదుటన్
మెత్తఁబడె దానిచెలు వని, యత్తఱి గుసగుసలఁ బోయి రచ్చర లెల్లన్. 107

తే. వేయుఁగన్నులు పలయుఁ బో వీరిఁ జూడ, నని కవుల్ దంపతులచెల్వు వినుతసేయఁ
గాదు పదివేలకన్నులు గావలె నని, చూచు చుండె సహస్రవిలోచనుండు. 108

చ. కలరొకొ యెవ్వ రైన నవుఁ గా దని యడ్డము పల్కువార లీ
యిల మఱిఁ దా నెఱుంగనటు లెంతటిమాయలకాఁడు కన్యకా
తిలకము దార వోయ వసుదేవునిఁ గట్టడ సేసి వేయిక
న్నులు గలవేలుపుంబలెఁ గనుంగొను చుండె మురారి చెంగటన్. 109

క. మధుకరవేణులు కొందఱు, మధురోక్తులు వెలయఁ దెర యమర్చిరి సరగన్
మధుమథనజనకుఁ డంతట, మధుపర్క మొసంగె నృపకుమారాగ్రణికిన్. 110

తే. దేవకి యొసంగఁగా వసుదేవుఁ డపుడు, చంద్రకాంతపుగిండి గొజ్జంగ నీటఁ
బసిఁడిపళ్లెములోఁ బదాబ్జములు గడిగి, తనదుమేనల్లునకుఁ గన్య ధార వోసె. 111

ఉ. నూతెలఁ జేరి యష్టమహిషుల్ దగువారు నొసంగ నావలం ...
గోరిక నిక్కి ... యొసంగ వాద్యముల్ ...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జోరు కలంగ సంగములు పొంగ వధూవరులం గడానిబం
గారపు మెట్టుఁ బ్రాలపుటికల్ గదియించిరి గొంద ఱైదువల్. 112

క. వడిఁ దెఱపల్ దెర వంపం, బడఁతుక నగుమొగము గానఁబడియెఁ గాంతల్
తడఁబడఁగ శరన్మేఘముఁ, బెడఁబాసి చెలంగుచంద్రబింబమువోలెన్. 113

క. అమృత మొలుకునధరంబున, గుముదచకోగముల నేలుకొనుశుభదృష్టిన్
గమలములకళలు గైకొను, రమణీమణిముఖముఁ దెఱచి రాఁ జన వలయున్. 114

చ. పొలయలు కందు వేఁడుకొనుపొందికఁ దెల్పెడులీల సిగ్గుదొ
ట్రిలినముఖాబ్జ మెత్తి మెడక్రిందికి హస్తయుగంబు సాఁచి వే
నలిఁ దెమలించి సౌఖ్యకలనస్థితి గట్టిగఁ బట్టి కట్టె న
వ్వెలఁదుక కంఠసీమఁ గురువీరుఁడు మంగళసూత్ర మయ్యెడన్. 115

చ. తమతమవార లొండొరులదండఁ గరంబుల ముత్తియంపుఁబ
ల్లెము లిడి చేయి మీఱఁగవలెం జుమి నీ కని యెచ్చరింపఁగా
నమితముగా సుభద్రపయి నర్జునుఁ డర్జునుపై సుభద్రయుం
దమిఁ దలఁబ్రాలు వోసి రెలనవ్వును సిగ్గును లోఁ దొలంకఁగన్. 116

తే. అగ్ని సాక్షిగఁ బెండ్లాడినట్టి ప్రియప
ఘూటియును దాను బంగారు పీఁటమీఁద
నుచితగతి వెలయంగఁ గూర్చుండి పాక
శాసని చెలంగ దీవించి సేస లిడఁగ. 117

తే. మృగమదముచెంతఁ గుంకుమరేఖవోలె, నీలమణిపొంత నుదిరిపొన్రేకువోలె
మేఘముకుఱంగటను దీఁగమెఱపువోలె, నర్జునునిచెంగట సుభద్ర యలరె నపుడు.

చ. కలుగుఁ గలావిశేషము జగంబునఁ బెండ్లి యటన్న నెట్టివా
రల కటువంటిపట్ల నెలప్రాయము రూప మెయార మాని పే
ర్కలిగినరాచకూఁతు రఁట రాకొమరుం డఁట యేమి చోద్య మో
పొలపుమిటారిసిగ్గరులు చూపరచూడ్కికి విందు సేయుటల్. 119

క. అంతటఁ బౌలోమీమఘవంతులకుం బెండ్లికొడుకు వందన మిడఁ ద
త్ప్రాంతమునఁ బెండ్లికూఁతురు, గొంతటు తల వంచి మ్రొక్కఁ గొంకుచు నున్నన్.

శా. ఎంచం గాఁ దగు సత్తమామలను దా నిర్వేల్పం గా మనస్
ప్రాంచద్భక్తిని సాధ్వి యందు దది మీపట్ల న్నిజం బయ్యె నేఁ
డంచుం జీరి శచీపురందరుల కాహ్లాదంబుగాఁ బల్కి మ్రొ
క్కించెన్ దేవకి [illegible] 121

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. ప్రణయం బొప్పఁగఁ గృష్ణునిం గని సుపర్వస్వామి యీసర్వల
క్షణముల్ గల్గినకన్య మంచివరునిం గాఁ జూచి మీ నేర్చునై
పుణి మీకే తగు నంచుఁ బల్కఁ బరమాప్తుల్ మీరు రాఁగా విజృం
భణవృత్తిన్ సెలవే సెఁ బెండ్లి యని యప్పద్మాక్షుఁడుం బల్కఁగన్. 122

సీ. వియ్యంపుమర్యాద వేగుఁజామున శచీ, జాని బువ్వాన భోజనము సేసి
గుమగుమవాసించుకుంకుమకస్తూరి, యమరవల్లభునిహస్తమున కిచ్చి
గంబూర గుల్కినతాంబూల మింద్రుఁ డం,దుకొనదో సేనానిదోయిట నిడి
పీతాంబరముల విప్పి యనేకములు వజ్రి, చేతిసంజ్ఞ జయంతుచేతి కొసఁగి
తే. కేలఁ గేల్వట్టి కొన్ని వాకిండ్లు గడచి, రాఁగ విచ్చేసి యుండుఁడు రా వల దని
బలిమి బలభేది యెదురుగ నిలిచి మ్రొక్క, వేడుక మురారి కేల్మోడ్చి వీడుకొలిపె.

క. అంతకు మునుపే హరి య,త్యంతకుతూహలముతోడఁ దగు మేరల న
య్యంతఃపురిభోజసుతా,కాంతను బౌలోమి ననుపఁ గట్టడ సేసెన్. 124

తే. రుక్మిణీదేవితమయత్తమ్రోల శచికిఁ, బసిఁడిగిన్నియఁ గస్తూరి యొసఁగ నామె
చేఁ దిగిచి దేవకీదేవిమీఁదఁ జిలికి, సదినెగా రని యొకకొంత వావి నెఱపె. 125

ఉ. వీయపురాల వైతి గదవే యిపు డత్తివు తొంటివావి నో
తోయజనేత్రుఁ గాంచినవధూమణి నీసుతఁ బెండ్లి యాడఁగా
నాయమ నాకుమారునకు నర్మిలి వత్తఁగ నత్తి వావిచే
నాయువు గల్గువాఁ డవు నటండ్రు శుభం బగు దీన నెంతయున్. 126

తే. అని సరసలీల నుడుగర లంది యపుడు, పారిజాతంబుకతన మున్ బరిచయంబు
చాలఁ గల్గుటఁ బ్రియముతో సత్యభామ, తనకు మ్రొక్కిన నింద్రాణి నెనరుతోడ.

ఉ. చెల్లెల లెస్సలా పెరటిచెట్టుగ నాటినపారిజాత ము
త్ఫుల్లనవీనమానములతో విలసిల్లుచు నున్నదా సదా
యుల్లము దానిమీఁదటనె యుండును నా కది ప్రాపుఁ బ్రోవుఁ బు
ట్టిల్లును జొచ్చి నిల్లునయి వృద్ధి నొసంగెడు నీకు నెంతయున్. 128

క. అని యుచితోక్తుల వారల, మనములు రంజిల్లఁ జేసి మన్ననతో న
య్యనిమిషలోకాధీశ్వరు, ననుఁగుంబట్టంపుదేవి యరిగినయంతన్. 129

తే. ఏల యాలస్య మిఁక నిందుఁ బోవిలు సొచ్చి, నాగవలి సేయుదురుగాక వేగ కదలి
పాండు దంపతు లని ధనుష్పాండరథహ,యంబుల నొసంగి నరుఁ బయనంబు సేసి.

ఉ. చంద్రకి పింఛలాంఛనుఁడు చంద్రిక లీనెడునవ్వుమోముతో
నింద్ర [illegible]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెంద్రిక పెట్టి యందుపయిఁ జెంద్రికవన్నియసాలు సుట్టి ని
స్తంద్రతఁ దానె ముద్రయిడి చారులచేఁ బనిచెన్ రయంబునన్. 131

క. ఈరీతి నన్ని యమరిచి, యారాతిరి యేఁగి శౌరి యడఁకువ నుండెన్
సీరికడ దేవకియుఁ దన, గారాబుఁగుమారి నంపఁగా రమ్మనుచున్. 132

తే. అత్తవారింట సకలభాగ్యంబు లున్న, మగనిమీఁదఁటఁ దన కెంత మక్కువున్న
నాఁడుఁ బుట్టువు పుట్టింటి కాసపడును, గావున సుభద్ర యొకతీరుగాఁగ నుండె.

తే. తల్లిదండ్రులు గారానఁ దన్నుఁ బెనుప, వదినె లన్నలుఁ గడు గారవంబు నెఱప
నల్లయూరంత జలగంబునందు నుండి, యొకతె నెడబాసి ఖోవ నెట్లోర్చుమనసు.

క. అట్టులఁ దొంగలిరెప్పలఁ, దొట్టెడుబాష్పములతోడఁ దొట్రిలుముద్దుం
బట్టిఁ గని కడుపు చుమ్మలు, చుట్టఁగ నది మట్టుపఱిచి శుభ మొనరంగన్. 135

తే. వింతఁజే యేమి మేనత్త గొంతిదేవి, కోరి వేఁడియు బెండ్లాడినారు మీర
లొండొరులు నీవిభుండు లోకోత్తరుండు, దొరకెనుసుభద్రమంచికాఁపురమునీకు.

క. ఈలోనఁ జూడవచ్చెద, మేలే చింతిల్లెదనుచు నెంతయు బ్రేమన్
గేలంగ్రొమ్ముడి దువ్వుచు, బాలన్ దీవించి తల్లి పనుపన్ వేడ్కన్. 137

మ. సకియ ల్గొందఱు వెంట వచ్చి మణిభూషల్ చక్కఁగాఁ దీర్చి చెం
ద్రికపూవన్నియజిగ్గుఁజేల కటి నెంతే గట్టిగాఁ జుట్టి పెం
డ్లికుమారుండు కరాగ్ర మూఁత యొసఁగన్ వ్రీడావతిం దేరి మీఁ
దికి నెక్కించిరి మందహాసకలనాదేదీప్యమానాస్య లై. 138

తే. అటులఁ దేరెక్కి దంపతు లరుగఁ జూచి, జనులు రతిమన్మథులు వీర లని తలఁచిరి
హరితతురంగము లించువిల్లలపుతూపు, లంద యుంపంగ సందియ మందనేల. 139

ఉ. పచ్చనిపచ్చడంబుదొర పంపిన తోఁపునె బోవునంతలో
నచ్చటఁ జెల్లవాలి నితఁ డర్జునుఁ డీమె సుభద్ర వీరిఁ బో
నిచ్చినమాట వచ్చు బలకృష్ణులచేత నటంచుఁ దారు తా
రెచ్చరికై పృథుశ్రవసుఁ డేలికగాఁ గల ప్రోలి కాపరుల్. 140

క. అలబలముల సంఖ్యము లై, అలబలములు నేయుచుండ నప్పుడు గలఁకం
కలకంఠీమణి రిపుమద, కలకంఠీరవుని ధవునిఁ గని వికసిత యై. 141

పంచచామరము. హుటాహుటిన్ హలాయుధుం డహో మహోగ్రుఁడై తనం
తటం దటాన నిప్పు డీవిధం బెఱింగి వచ్చెనో
ఘుటాఘుటీల నెల్లఁ ద్రోవఁ గట్టి పట్టఁ బంచెనో
ఘుటాఘుట ... ఛటోద్భటుల్ ... ఘటిల్లెడున్. 143

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. తెరగడపఁగ మాయన్న దిద్దెనన్న, నేయ నేరిపె వింట నొక్కింత నాకు
నావదినె సత్యభామ మున్నరక యైన, నిలిచి మున్నరకాసురు గెలిచెఁ గాదె. 143

క. అని రాజకన్య గావున, మనమునఁ గలధీరతయును మమతయుఁ దెలుపన్
విని యట దరహాసంబున, ననుఁజెక్కిలి చికిలిగోట నొక్కుచు వేడ్కన్. 144

క. నన్నెవ్వనిఁగాఁ జూచితి, కన్నియ నీచేయునంత కార్యం బిట నే
మున్నది చూడుము చెండెద, భిన్నాభిన్నములు గాఁగ సేనల నెల్లన్. 145

క. నీవేడు కేలగాదనఁ, గావలె నటువలెనె తెరగడపు మటంచున్
చేవిలునమ్ములుఁ గైకొనె, నావిజయుఁడు సమరసన్నహనదోహలుఁడై. 146

ఉ. అంతటిలోఁ బృథుశ్రవసుఁడాదిగఁ గల్గినవీరయోధుల
త్యంతకఠోరతోమరశరాసనబాణకృపాణపాణులై
పంతము లాడుచుం బదరి పైఁబడఁ జూచుబలంబు లెల్లఁ దా
మంతట నంతట న్నిలిపి యడ్డముగం జని యాధనంజయున్. 147

ఉ. స్యందనమున్ దురంగములు శౌరివె పో బలరాముచెల్లెలీ
యిందునిభాస్య యీమె నెట కెత్తుకపోయెదు రాకుమార యే
మందురు యాదవుల్ విననవా యిటువంటివె రాచవారితోఁ
బొందులు గానకుండఁ గొనిపోఁ దగవా మిముపంటివారికిన్. 148

క. అనుటయు నే మీకనినం, గనకుండిన నానఁ బూనఁగలరా మీరల్
మనవలసిన నీమాటలఁ, బనిలేదు చనుం డటంచుఁ బైఁబడి రాఁగన్. 149

ఆ. రాకురాకు మనెడిరట్టడితనములు, పోకుపోకు మనెడిపొగరుపగలు
పొడువు పొడువు మనెడి బెడిదంపుబీదముల్, విడువు విడువు మనెడివీఁక లెసఁగ.

ఉ. ముందరవెన్క నీకరణి ముంచుకొనం జలియింప కింపొన
ర్పం దరళాక్షి దేరుగడపన్ గడకంటనె పాఱఁ జూచి విం
టం దొడి యేయుటల్ బయ లొనర్పక యెంతటివారు వార పా
రందరి యందఱన్ శరపరంపర వెంపరలాడె నయ్యెడన్. 151

సీ. కొండలవలెనున్న కొమ్ముఁగత్తులభద్ర, దంతావళములమొత్తములు బలసి
యంబుధితెరలచందంబునఁ దుటుములై, భాసిల్లుకంఖాణబలము లొదవి
విరివియై మేఘముల్ పెరిగి వచ్చిన జోక, ఘనపతాకలశతాంగములు హత్తి
వెదురుపొదల్ పేర్చువిధమునఁ గనిపించు, గడలపౌఁజులు సమగ్రముగఁ గూడి

తే. యుక్కుపొడిరాలరోషంబు పిక్కటిల్ల, నొకరొకరి కేపవెట్టు నత్యుగ్రసింహ
రవములు [illegible] లమొఖాల్చులు నటింప. 152

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ఎత్తినయాయుధంబు లవి యెన్నియు నన్నిటి నన్నితూపులన్
దుత్తునియ ల్గఁ జేసి మఱి తోడనె పూనఁగఁ జేతు లాడ నీఁ
డుత్తరణీరథాశ్వములయండకు రావిడఁ డంప తున్కలయే
నత్తరి నాతఁ డే మనఁగ నాశరలాఘవసావధానతల్. 152

మ. రథపుంజెయ్యులఁ దా వినోదముగ సారథ్యంబు గావించుక
న్యకపైఁ బెట్టినచూపె కాని యిటు నీనన్ జూచుటా లేదు సా
యకపంక్తుల్ నడుచున్ సహస్రములు గా వయ్యారె విప్వచ్చచే
తికిఁ గన్నుల్ గల పంచు నెంచి రపు డెంతే వీరయోధాగ్రణుల్. 153

ఉ. శూరకులంబు సర్వ మొకజోకయి వచ్చి యెదిర్చనేని నే
నీరమణీశిరోమణి గ్రహింపక పో నని గట్టిగా నహం
కారము మీఱఁ గంకణము గట్టుక యుండెడు నిప్పు డర్జునుం
డౌర రణంబు పెండ్లికొడు కంచు నుతించిరి వీరపుంగవుల్. 154

ఉ. అమ్మెయి నాజివారణభటావళిఁ గప్పినతూపు లేమనన్
దెమ్మలుగా దటాకములనిండుకొరమ్ములఁ బుష్పవాటులం
గ్రమ్మశిలీముఖంబుల ధగద్ధగితోన్నతసౌధగోపురా
గ్రమ్ములయందు వ్రాలెడుఖగమ్ముల నెన్నిన నెన్న శక్యమే. 155

క. అలుఁగులపోకడలును మై, యలయికలును మీఁదుమిక్కిలైకడు లోనై
జలములు దమతమబాహా, బలములు నటఁ బనికి రాక భయవిహ్వలులై. 156

ఆ. ఒక్కమొగముగాఁగ నుఱికిరి సైనికుల్, దిక్కుమొగముగాఁగఁ జిక్కుభటులు
మ్రొక్కి రీటియలు దటుక్కునఁ బడవైచి, యక్కిరీటియెదుట నాఁగఁ గలరె. 157

వ. ఇత్తెఱంగున జయాంగనాసంగమంబునం బొసంగియు జెక్కుచెమర్పక యక్కురు వీరుండు సారథ్యనిపుణత్వంబునకు మెచ్చి యిచ్చిగురుఁబోఁడి నవారితప్రేమాతిశయంబునం గౌఁగిలించి యొక్కించుక రేక మోవనినాయురస్స్థలంబున నీకుచకుంకుమరేఖ లంటించి మీవారికి నూడు దీర్చితి వని నవ్వుచు, నవ్వలం గొంత దవ్వరుగు చున్నప్రచ్ఛన్నవేషంబునఁ దనరాక కెదురుచూచు చున్నవిశారదప్రముఖాప్తపరివారంబుల గారవించి మురారిప్రేరితదాశార్హనివేదితార్హమార్గంబున మహారణ్యంబులును గిరివరేణ్యంబులును నదీనదంబులునుం జనపదంబులుం గడచి స్వదేశంబు గాంచి యుల్లాసంబున నందంద విశ్రమించుచుఁ జనం జనఁ జారులవలనం దెలిసి యగ్రజానుశాసనంబున నానాసేనాసమన్వితులై మాదీసుతు లెదుర్కొని యుపాయనా [illegible] దుస్సహ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిస్సాణప్రముఖనిస్వనంబులు బోరు కలంగ నలంకృతనిస్తుల స్తంబేరమారూఢుం
డై గగనోల్లేఖితోరణధ్వజోల్లోచ ప్రాంచత్సిచయప్రచయ ప్రచలత్ప్రచలాకిచిత్ర
చ్ఛవివ్యాప్తహేమచ్ఛవిఫలగుళుచ్ఛవిరాజరంభా స్తంభవిజృంభిత ప్రతిమందిరంబు
ను, విలోకితబిబ్బోకసతీవ్యాకోచలోచనప్రాచుర్యవిభ్రాజమానతనూజోత్సవదిదృ
క్షాగృహీతానేకవిగ్రహసహస్రాంబకవిడంబిభర్మ హర్మ్యనికరంబును, ఏరాజనల
జాక్షతకుసుమకిసలయవ్యాకీర్ణకలశగ్రహయాళుమహీలేఖమహిళాభూయిష్ఠ ద్రాఘి
ష్ఠవేదికాంతరంబును నగునింద్రప్రస్థపురంబును, సకలజనరంజనకుశలవిశాలకటాక్ష
కృపారసావేశంబునఁ బ్రవేశించి మున్ను సుభద్రముహూర్తంబున సుభద్రాభద్ర
భద్రేభయానం జతురంతయానంబున శుద్ధాంతంబున కనిపి ధౌమ్యాదుల కభివందనం
బుఁగావించి యాశీర్వాదంబులు గైకొని నిజాగమనసంతోషరసోన్మేషభూషితసుప్ర
సన్నాననబిసప్రసూనుండును, రత్నసింహాసనాసీనుండును నగుధర్మసూనునకు సా
ష్టాంగం బెరఁగి, భీమసేనునకు నమస్కరించి యంతఃపురికిం జని కుంతీదేవికి వందనం
బాచరించి ద్రుపదనందన నుపచరించి యిష్టాలాపంబుల సుఖం బుండె. 158

ఉ. అంతట ద్వారకాపురమునందు సభాపరిపాలుఁ డర్జునో
దంతము యాదవుల్ దెలియునట్లు హజారమునందు భేరి య
త్యంతరుషాకషాయితహృదంతుఁడై చఱపించె మించె ది
గ్గంతిఘటాశ్రవఃపుటభిదాచణభీషణభూరిభాంకృతుల్. 159

క. ఆనాదము విని హలి మొద, లైనయదూద్వహులు పురికి నరుదెంచి సభా
సీనులయి నరునికపటవి, ధానము మఱి మఱియు నడిగి తప్తాశయులై. 160

తే. యతి ననుచు వేషభాషల నటుమటించి, పొంచి తఱి వేచి కన్నియఁ గొంచు నరిగె
దొరకుసన్న్యాసమనుమాట తిరము గాఁగ, నర్జునుం డద్దిరా యెంతదుర్జనుండు. 161

శా. ఏతన్మాత్రమె కార్యభార మని పై యెత్తెన్న కే నేఁడు ని
ర్భీతిన్ బాలికఁ గొంచుఁ బోవ నుచితంబే కండగర్వంబు దు
ర్నీతుల్ యాదవవీరసింహములతో నే నా బలారా బలా
రాతిపౌత్రుఁ డెంత నేసె నిది తీరా వీరరాణ్మౌళికిన్. 162

ఉ. వంచన నేసి యిట్లు చెలువం గొనిపోవఁ బ్రలంబవైరి సై
రించునె దుర్మదాధిపవరేణ్యులభూములు దున్ని ధూళి గా
వించఁడె పిండిపిండిగఁ బ్రవీరవిరోధికిరీటరత్నము
ల్దంచఁడె ఘోరసీరముసలంబులు [illegible] 163

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అని కాళిందీ భేదనుఁ, డనువాక్య మొకింత విన్నయంతనె మేఘ
ధ్వనిఁ గెరలెడుమదకేసరు, లన యోధాగ్రేసరులు మహామత్సరులై. 164

ఉ. యాదవవార్ధి వెల్లివిరియన్ మఱియాఁగెడుపాటివీరుఁ డి
మ్మేదిని నెవ్వఁ డిందులకు మీరలు గావలె నేమె చాలమే
పోదుమె కట్టితెత్తుమె బుభుప్రభునందనుఁ డెంత వానితం
డ్రే దురమం దెదిర్చినను రేకు మడంతుము మాటలేటికిన్. 165

తే. అని యుదగ్రహలగ్రహావ్యగ్రుఁ డైన
యన్నమాటలు సభవార లన్నమాట
లేమి చవిగామియును దాల్మి యోమి భక్త
జనకుశలకామి యలయదుస్వామి కనియె. 166

క. యదురాజకులశిరోమణి, యెదురా మీ కొకరుఁ డుచిత మెఱిగియుఁ బర లెం
చ దురాప కోప మానుట, చదురా తెగరానిచోట సైరణ తగదే. 167

క. ద్రోణాచార్యులశిష్యుఁడు, బాణాసననిపుణుఁ డరినృపాలకమకుటీ
శాణాగ్రతేజతోగ్రకృ, పాణాంచద్భుజుఁ డతండు ప్రభుమాత్రుండే. 168

ఉ. అపురమర్దనుం డయిన నాతని నడ్డము దాఁకి నిల్వఁగా
నోపఁడు మత్స్యయంత్రము మహోద్ధతి నేసి స్వయంవరంబునన్
ద్రౌపదిఁ గైకొనం జెనకురాజకుమారులపా టెఱుంగమే
మూఁపులు మూఁ డగున్ రిపుచమూఁపులఁ గన్నపుడే కిరీటికిన్. 169

ఉ. మాలిమి లేదు గాన ననుమానము నామదిఁ దోఁచె నప్పుడే
బాలిక సేవ సేయఁ బనుపన్ వలదంటిని గాదె దానికే
మీలువు కల్గు మేనమఱఁదింతయె యాతఁడు నైన నైననే
లోలత నింక నాగవనిలోపల నిష్ఠుర మేల పల్కఁగన్. 170

ఉ. క్రీడిసమాను లెంచఁ గలరే యిల కేడులలోనఁ దూలఁ బో
నాడఁడు వైరినైన విడనాడఁడు నెయ్యము కోపగించియుం
జూడఁ గలట్టివాఁడు సరసుండు సుభద్రకు హర్ష వార్ధిలో
నాడఁక నంతకం టె నను వైనవరుం డిఁక నెవ్వఁ డవ్వలన్. 171

ఉ. నమ్మినవారు పాండునృపనందను లందఱిలోనఁ బెద్దరా
మిమ్మె గణించు ధర్మజుఁడు మీ రటకున్ విజయంబు సేయ వే
గ మ్మేదు రేఁగుదెంచి కడుఁ గన్నులఁ గప్పుకొనుం బదుం డనం
దమ్మునిమాట యున్న [illegible] సంభ్రమంబునన్. 172

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. గజకంఖాణశతాంగపత్తిజలవర్గంబుల్ సమగ్రంబులై
భజియింపం బితృపుత్రపౌత్రసుహృదాప్తశ్రేణిఁ గూడం బ్రియా
నుజుఁడుం దాను సమస్తవస్తుధనసందోహంబుతో వచ్చె స
ర్వజనానందకరంబు గాఁగ నటు లింద్రప్రస్థమున్ జేరఁగాన్. 173

ఉ. అంతకు మున్నె కృష్ణుఁడు హలాయుధుఁ దోడ్కొని వచ్చు చున్నవృ
త్తాంత మెఱింగి ఠీవి మెఱయన్ నగరిం గయిసేయఁ బంచి య
త్యంతవినీతి ధర్మజుఁడు దమ్ములుఁ దా నెదు రేఁగి రేవతీ
కాంతునకుం బ్రణామములు గాన్కలు సేసి యథాక్రమంబునన్. 174

మ. చెలువం దెచ్చుచు నుండి యీసున శునాసీరాత్మజుం డమ్మహా
బలముం జేరఁగఁ బోరు మేదురదురాపక్రోధముం బాసి లో
నలరం గౌఁగిటఁ జేర్చె శంభుజభుజాహంకారరేఖానిర
ర్గళమార్గప్రబహుంప్రలంబహు బహుంకారంబు గాఁ బల్కుచున్. 175

ఉ. బావ యటంచు వాని నడుపన్ భయభక్తుల మ్రొక్కవచ్చు న
ద్దేవకిపట్టి ధర్మజుఁ డతిత్వరితమ్ముగఁ గ్రుచ్చి యెత్తి త
ద్భావ మెదం గుదుర్పడఁగఁ దాల్చినభంగిఁ గవుంగిలించి మా
కీవ గదయ్య సర్వశుభహేతువు నిచ్చలు నంచు నెంచుచున్. 176

తే. కడల బలరామకృష్ణులు నడుమఁ దాను, భద్రదంతావళము నెక్కి పాండవేయ
ముఖ్యుఁ డతరాజసంబున మువ్వెలుంగు, పోలికఁ బొసంగ వచ్చెను బ్రోలి కపుడు.

ఉ. అంతిపురంబులో నరిగి యన్నకు వందన మాచరించు నా
కుంతికి మ్రొక్కి భక్తిఁ దమకుం బ్రణమిల్లిన ద్రౌపదీసతిన్
స్వాంతము రంజిలం బలికి శ్యామహరిత్ పరిధాను లొప్పి రం
తంతకు నిష్టబాంధవసమాగమసౌఖ్యమునం జెలంగుచున్. 178

క. దొర వెట్టినవారు వెట్టిరొ, యరు దావా విడుదు లున్నహవణికలులుపా
పరిధవము నింద్రభోగమె, దొరకెను దమకనని వారు తుది లే రొకరున్. 179

క. వీయమువారికి నిట్లు ద, వీయముగా నుండి వచ్చి విపులశ్రమముల్
దీయ ముదం బొనరించి కడుం, దీయము కనిపింపఁ గా యుధిష్ఠిరుఁడనియెన్.

క. చనువున బలిమిం గన్నియఁ, గొని వచ్చి వివాహ మాటకు స్వతంత్రులఁ గా
నొనరించినార మము ని, ట్లనుకూలత గల్గుబంధు లవనిం గలరే. 181

తే. ఆదినారాయణుం డీమురాసురారి, యురగకులభూషణుండ వీ వరసి చూడ
నిట్టిమీబాంధవము గల [illegible] మెట్టిమహిమ, సంసార [illegible] మేము సిరపాణి. 182

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. అని ప్రియభాషణంబుల మనోజ్ఞము రంజిలఁ జేయ సంభ్రమం
బున హలి సర్వసన్నహనముం దగ నిల్లెదు రేఁగి పెండ్లి సే
సినదొర యెందు లేఁ డనఁగఁ జెల్లెలి ముద్దుమఱందిఁ గోరికల్
పెనఁగొనఁ బెండ్లికూఁతుఁగనుఁ బెండ్లికుమారుఁగఁ జేసి వేడుకన్. 183

సీ. సకలవాద్యములు బోరు కలంగ నెడ మీఁక, నలుఁగులు నలుపాలు నడచుచుండ
నిఖిలబాంధవరాజనికరంబు మేలైన, యుడుగరల్ గొని వచ్చి పొడ గనంగ
నాశ్రితవిద్వత్కవిశ్రేణులు యథేష్ట, సంభావనలఁ జాల సంభ్రమింప
విందులఁ గర్పూరవీటికాంబరవసం, తముల నెల్లజనంబు తనివి నొందఁ
తే. బ్రియము వినయంబు దాల్మి యోపికయుఁ గల్గి, యచ్యుతాగ్రజభీమసేనాగ్రజన్ము
లెంతటిమహాత్ములని జగం బెంచఁ జేసి, రుచితగతి నొప్ప వైవాహికోత్సవంబు.

ఉ. అంతట నైదునాళ్లును మహామహిమం దగి దంపతుల్ గృహా
భ్యంతరదేవతార్యనతులై తన కర్మిలి మ్రొక్క రుక్మిణీ
కాంతుఁడు వల్కె లేనగవు గ్రమ్మఁగ మీ రిటు లెల్లకాలముం
మింతురు గాక శోభనము మీఁదనె శోభనమై ముదంబునన్. 185

క. అని దీవించిన లోలో, నను ముసిముసినవ్వు లొలయ నమ్రాననులై
తనరిరి వా రామాటను, పునరభివాదనము సేయుపోల్కి జనింపన్. 186

చ. తొలఁకెడుప్రేమ బందుగలతో మణిపాత్రిక లందునప్పుడు
జ్వలదమృతాన్నముల్ కొలముసామికి నప్పన గాఁగఁ బందువె
న్నెలబయలం భుజించి నెఱినీ బెనఁగం సగపాలుగంబురా
గులికినకమ్మవీడె మొకకోమలి యీఁగొని క్రీడి వేడుకన్. 187

ఉ. చందురురాతిబాగడపుజంటబవంతి వెడందయంకణం
బుందగు లూని పార్శ్వమునఁ బొల్పగుపల్వగకెంపుటంచుటా
కుం దెలిగుండుకంబముల క్రొంజిగిబోదెల నందగించి పై
సంఘులఁ బంచవర్ణమణిజాలకముల్ రహిఁ జూప లోపలన్. 188

ఉ. బంగరుమేలికంబములఁ బాటిలువాటపుమధ్యరంగమున్
జెంగట జీవరత్నముల చెక్కడపుంబని మించు సెజ్జయి
ల్లుంగల వజ్రపుంబలుక లోపల పొసంగిన నొప్పుచప్పర
మ్మం గలభావచిత్రనవమోహనకేళిగృహాంతరంబునన్. 189

చ. కెలఁకుల వజ్రముల్ నడుమఁ గెంపులు మూలల ముత్తెముల్ పర
స్థలములఁ బచ్చలుం దవరి జాలి దగం బని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెలయఁగఁ దేరి చూడఁ గడు వింతయుఁ గోటికిఁ గోటి యైనను
న్విలువ యొనర్పరానియొకనిద్దపుమంచముపై వసింపఁగన్. 190

ఉ. గోవజవాదికస్తురియుఁ గుంకుమ గందము పైఁడిగిన్నెలన్
దావి బుగుల్కొనం గెలఁకుఁ దార్చిరి పంజరకీరశారికల్
దేవ పరాకు సామి యని తెల్పఁగ రత్నపుఁగీలుబొమ్మలే
కావలెఁ గొంద అందు నుడిగంపుటొయారపుముద్దుజవ్వనుల్. 191

క. అందలికొందలిరుంబోం, డ్లందలికందళితశుకముఖాలాపరసం
బందలిమందలిమంబులు, నందలిబొందళ్ఁదితెరలు నవలం గలవే. 192

ఉ. చక్కఁదనంబు లెల్ల నొక చక్కినె దొంతరగాఁగ నిల్చినో
యొక్కెడఁ జూడఁ జూడ్కి కది యే విడిప ట్టగుఁ జూడఁ జూడఁగా
మిక్కిలి వింతయై మెఱయు మెచ్చులకు న్నెల వీ దొకింతే య
మ్మక్క నుతింపఁగాఁ దరమె యాపడకింటివిలాససంపదల్. 193

తే. ఉండె నరపతి యందు మే నుబ్బుచుండ, నఖిలసామ్రాజ్య మేలినయంత వేడ్క
రమ్య మగునిల్లు మేలైనరాజముఖియుఁ, గల్గె నఁట యంతకన్న భాగ్యంబుగలదె.

క. అంతటఁ బ్రౌఢసఖీతతి, కాంతామణిఁ గాంతుకడకుఁ గదియించుట కై
వింతగ మోమునఁ జిఱునగ, వింత గనంబడఁగ ముదితహృదయాంబుజ లై. 195

సీ. జడకుచ్చుఁ గైసేయుమడువు చేడియ విరుల్, వేనలి పట్టిన వీడకుండఁ
బేర్చుక్క సతి యింద తీర్చుము తిలకంబు, కస్తూరిచెమటచేఁ గరఁగకుండ
గొనుజంటరవికఁ గుంకుమగంద మలఁదుమో, చెలి యెంత యొరసినఁ జిటులకుండఁ
మొలనూ లిదిగో బోటిచలువ పొందుగఁ గట్టు, సయ్యాటలనె నీవి సడలకుండఁ
తే. తరుణి కివియిచ్చఁగద మెచ్చు తప్ప దనుచు, నేరుపరులైనవారిఁగా మేలుపలుప
గాంతనవసంగమార్హశృంగారవిభవ, లీల నలరించి రాజవరాలి నపుడు. 196

క. తడ వేటికి లేజవ్వని, విడె మీవలెఁ బతికి మంచివేళ సుమీ యి
ప్పుడు తాకన్నియ వల్లభు, కడఁ బెనఁగుదు గాక పెనఁగఁగా నిటఁ దగునే. 197

సీ. ప్రియముతో రమ్మని పిలిచినఁ జేరఁ బో, యెదవు గా కూరకుండెదవు సుమ్మ
చెంతఁ గూర్చుం డంగఁ జేఁ జూపఁ గూరుచుం, డెదవు గా కూరకుండెదవు సుమ్మ
విడెము చేతి కొసంగ వినయంబుతోడ నం, దెదవు గా కూరకుండెదవు సుమ్మ
మధురోక్తి వినఁ గోరి మాటాడ మాఱుప, ల్కెదవు గా కూరకుండెదవు సుమ్మ
తే. కాక విభుఁ డైనఁ గొంత సిగ్గరితనంబు, గడలుకొనియున్నఁ గక్కునఁ గడపరాక
చక్కఁగ నొకింత [illegible] సమ్ముఖమున, నిలువుమీ రత్నపాంచాలిచెలువ మీఱి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అనవలసి యంటి మింతే, నినుఁ జూచిన నింద్రతనయునికి నింద్రతనూ
జునిఁ జూచిన నీకును మఱి, మన నూరక యున్నె పూర్ణిమాచంద్రముఖీ. 199

సీ. చిలుక నీచేఁగాక చెలిచేత నుండదే, నిమిరి యప్పుడె మాట నేర్పవలెనె
యెదుటఁ గొసెన వేయ కిడినారు దెమ్మని, వీణ యిప్పుడె మేళవింపవలెనె
పటముగానుకఁ దెచ్చిపట్టిన నిప్పుడే, చిత్తర్వునకు వార్వు చెప్పవలెనె
మంచిమాటలు దోఁచెనంచును బలకలో, నిప్పుడె కవిత వ్రాయింపవలెనె

తే. గంట సెప్పి సవారిఁ గ్రేఁగంట గనెదు, లెండు పోద మటన్న నటుండు మనెదు
వడిగ రావమ్మ కంచియే పడుకటిల్లు, కన్నియలఁ గంటి మిటు లెందుఁ గానమమ్మ.

ఉ. ఎక్కడ నైన వేడుక మెయిఁ శుభవేళలఁ బాను పెక్కుచో
నొక్కిసుమంత సిగ్గు వడు చుండెడు తేజనరాండ్రు లేరొ యో
యక్క యిదేమి యింత గలదా మఱి రే పిటువంటివార పో
దక్కఁ బెనంగువారలు సదా మగనిం బిగికౌఁగిలింతలన్. 201

క. ఏకతమునఁ జెప్పుదుమో, కౌ కందలు వినెడునట్లు గాఁ జెప్పుదుమో
మా కొక్కటి దోఁచినయది, నీ కెక్కడఁ గోప మగునో నీరేజముఖీ. 202

ఉ. కేవలభక్తితో నచటఁ గేలివనంబున నీవు సారకు
న్నేవ లొనర్చుచోఁ గలుగునే కత యేకత నిందు వచ్చుచోఁ
ద్రోవల నిల్తు రేకత వధూవరు లిద్దఱు నొక్కటైనచో
నేవగఁ బొఱునా మనసు లెవ్వ రెఱుంగుదు రమ్మ జవ్వనీ. 203

ఉ. వేగిరకాఁడు మన్మథుఁడు వెన్కను ముందును జూడఁ డంతకున్
వేగిర కాఁడు నీవిభుఁడు వీరిఁగటాక్షములంచె యేలఁ జా
ల్వేగిరకత్తె వీ వుచితలీలఁ దలంతువొ వేళ యెంతువో
యీగరువంపుసిగ్గు లవు డెక్కడనుండు సరోజలోచనా. 204

ఉ. కన్నెఱఁ జేసి చూచినమొగ మ్మిటు ద్రిప్పినఁ జే విదిర్చి నం
గన్నుబొమల్ ముడించినను గా దన మందల కేమి మున్న మీ
రున్న తెఱంగు నంగకము లున్న తెఱంగుఁ దలంచి చూచినం
గన్నియ మాకు నమ్మికలు గావు సుమీ పదిలక్ష లేనియున్. 205

తే. ఆయెఁ గా కుండె మంచిదే యందు కేమి, కొంతసే పిటు నవ్వితి మింతె మేము
చాలు నీక నైన జాగేల సరసములనె, ప్రొద్దు వోయెడుఁ బదవమ్మ ముద్దుగుమ్మ.

చ. అని కయిదండ యొక్కమృదుహల్లకపాణి యొసంగ నొక్కమో
హనవమా క్తికొ విమనక రెకురొ పాటట చక్కదుప్పి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఛవళకునమ్ము లొక్క కలభాషిణి ముందరఁ దెల్ప మందగా
మిని యనుటెల్ల నవ్వు డిసుమిక్కిలిగాఁ దనయందు నిల్వఁగన్. 207

ఉ. తాలిమిఁ గ్రుంగఁ ద్రొక్కి మదిఁ దత్తరముల్ దమియుల్ భయంబు హే
రాళము గాఁగ మైఁ జెమట గ్రమ్మఁగఁ గొంకుచు మెల్ల మెల్ల నే
బాలిక యేఁగుదెంచె విభుపాలికిఁ బ్రాణసఖుల్ దిమల్పఁగా
యేలికప్రేలకుల్ మనవి కేఁగెడునయ్యభిమానిపోలికన్. 208

ఉ. చంచలనేత్ర రాఁ గలుగుసంభ్రమ మేమనవచ్చు వాసనల్
ముంచుకొనెన్ సమస్తగృహముల్ మిఱుమిట్టులు గొంచు నల్గడల్
ముంచుకొనెం దనూరుచులు ముంగిటి కించుక రాక తొల్తనే
ముంచుకొనెన్ నృపాలునకు మోహముఁ గోర్కులు నెమ్మనంబునన్. 209

తే. మఱుఁగఁ గోరెడుకన్నియ తెఱఁగుఁ జూచి
చూడఁ గోరెడియువరాజుజాడఁ జూచి
వలఁతు లయినట్టియాకూర్మిపాలఁతు లపుడు
కూర్చి సమకూర్చి యిరువురఁ గూర్మి యనిరి. 210

తే. తేర దానెట్లు గడపెనో తెలియరాదు, తేర గదలించునట్లు దో తేరవలనఁ
గన్నె యుండాఁక నే మెఱుంగదు సుమయ్య, తేరుగడకాఁగ మెల్లనె దిద్దుకొనుము.

క. పాటలబింబాధర కసి, గాటుల కోప దని పలువగలు చెలుపంగా
నేటికి నెత్తింగి నడుపుము, మీటిన విచ్చుచనుదోయి మీచేతి దఁకన్. 212

తే. మీర లెఱుఁగంగ వలయు శృంగారమెల్ల
యువతితిలకంబుకంటె నోనవమనోజ
విభుఁడు మది మెచ్చి కర్పూరవీటి యొసఁగ
ముద్దుమొగ మెత్తరాదె యోమోహనాంగి. 213

క. వలరాజు కొల్చునంతటి, చెలువుఁడు నినుఁ గూడఁ గలిగెఁ జెప్పె డిదేమీ
కలఁ డిఁక నీపాలింటన్, జెలియా యఱచందమామజేజే యెపుడున్. 214

క. రావక్క పక్కలాకులు, గోవక్క శుభోత్తరముగ గొబ్బున విభుచే
నీవక్క సేవ సేయుము, నీ పక్కలఁ గలిగి రమణునికిఁ జిత్తము రాన్. 215

తే. అనుచుఁ గప్పురబాగాలు నాకుమడుపు
లచ్చకోరాక్షి చేతి కందిచ్చి మిగుల
నంతికము చేర్చి చేపట్టు మయ్య కోర్కు
లాదవఁ గాఁ జేయు నాసామి యువతిశయము, 216

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అని కన్నియ హస్తాబ్జముఁ, దన శ్రీహస్తమునఁ జేర్పఁ దాత్పర్యమునన్
గొని యామాటలచతురత, మనమునఁ మెచ్చుకొనురసికమణి వేమాఱున్. 217

చ. కలయఁగ మంచిలగ్న మిది గట్టిగ నే గడె లెన్నియయ్యెనో
తెలిసెద నంచు నోర్తుఁ జనుదేర దదే మని యోర్తు నెచ్చెలిం
బిలిచెద నంచు నోర్తు నొకపే రిడి వా రిటు లేఁగి రంద ఱ
చ్చెలియలవెంట నే సగము సిగ్గరి గాఁ దరుణీలలామకున్. 218

ఉ. పంచశిలీముఖంబులును బచ్చనివిల్లును బూని యెక్కుసం
ధించుచు నిర్వ్యరం బెనఁచి నెమ్మిఁ గరంపకడంకఁ జూడుమీ
యంచు గవాక్షసీమ నపు డాయెల తెమ్మెరఁ గూడి వేడుకన్
బొంచులు సూడఁ గాఁ దొణఁగె, బో మకరాంకుఁడు గాన కుండఁగన్. 219

తే. పతియు సతికేలుపట్టినపట్టు విడక
పెడమఱల వామకరమునఁ బిరుదుఁ జుట్టి
పట్టి రా నీడ్చి కూర్చుండఁ బెట్టినపుడు
తొడ తొడయుఁ దాఁకఁ దమిసిగ్గు గడకు నూక. 220

సీ. నెఱికొప్పుఁ గొనగోర నిమిరినయంత నే, తళుకు లేముద్దుఁజెక్కులి చెమర్పఁ
దళుకు లేముద్దుఁజెక్కులి నొక్కినంత నే, వలిగుబ్బచనుఁగవ పులకరించె
వలిగుబ్బచనుఁగవ నలమినయంతనె, నతనాభినీవిబంధంబు ప్రిదిలె
నతనాభినీవిబంధము నంటునంత నే, తను వెల్లఁ బరవశత్వంబు నొందె
తే. నపలఁ జెప్పెడి దేమి యానవరసికుఁడు, తావిచెంగావిచక్కెర మోవి గ్రోలి
కుసుమశరుకేళి నేమేమిగుఱుతు లిడెనో, బాల యెఱుఁగదు సౌఖ్యాబ్ధిఁ దేలియపుడు.

క. గాఢాలింగనవిముఖము, రూఢాంగస్వేదభరము రుంద్రవ్రీడా
గూఢాపాంగము నగుచు న, వోఢాసంగమము వేడు కొసఁగెం బతికిన్. 222

సీ. వీడుకొప్పునసామ విరిదండ దెలిఁ గ్రమ్మఁ, గమ్మకస్తురిబొట్టు చెమ్మగిల్లఁ
దనువున మేల్మాఁత తావిమాత్రమె చిక్కఁ, జిక్క చన్గవసరుల్ చిక్కువడఁగ
నొసలిపై ముంగురుల్ మసరి ముద్దునటింప, జూ పంతకంతకు సొలపుఁ జూపఁ
జిన్నారిచెక్కులు చెమటఁ జిత్తడి నొంద, నందంద యూర్పులు సందడింప
తే. నపుడు సమ్మతి పడి వేడ ననఁగి పెనఁగి, లోను గాకుండినుం మృగీవిలోలనయన
యతని నానందవార్ధి నోలార్చె నౌర, కలయికలఁ గల్గుహాసపులకలిమివలన. 223

నొక్కిపలుమొన బలుమొననొక్క నేర్పె, నంటి గోరులచేఁ గళలంట నేర్పెఁ
క్కిబిగిఁ గౌఁగిలింతల [illegible] యునపుడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. జిలిబిలివలినాలి మొలకతెమ్మెరలు గ, మ్మనిమేనితావుల ననుసరింప
నలరుఁదేనియ లాని యలరుతుమ్మెద ,దిమ్ము జంటచూపుల వెనువెంటఁదిరుగఁ
జిగురాకుమేఁతలఁ బొగ రొందుకోయిలల్, పాటల నీటు వెంబడి వెలుంగఁ
గుల్కుఁబల్కులముద్దు గుల్కు చిల్కలనేర్పు, పలుకుల బెళుకుల పజ్జ నిలువ
తే. సతియుఁ బతియును నారామశతుల నతుల
రతులఁ బెనఁగిరి చతురత లతిశయిల్ల
దొలుతఁ దమ నేఁచువారలె కొలిచి యుండ
వేడ్కకన్నను మఱి వేఱె వేడ్క గలదె. 225

క. నెల మసలె నంతఁ గాంతకు, నెలకొనె వేవిళ్లు వెల్లు నిద్దపుమేనం
దళతళ మని మెయిపూఁతల, తళతళఁ దళుకొత్తెఁ గ్రొత్తధవళిమదోఁచెన్. 226

సీ. కలదు లేదో యనుకొను గానఁగ నయ్యె, నెప్పల నలసత గప్పుకొనియెఁ
గులుకుఁ జన్గుబ్బలు ఏలుద్దలై మెఱుఁగెక్కె, నూఁగారుపైఁగప్పు సూలుకొనియెఁ
జెక్కుటద్దంబుల నెక్కొనెఁ దెలినిగ్గు, బడలిక నడుపులఁ గడలుకొనియెఁ
జిట్టూటచెమటలచిత్తడి మెయినిండె, సారెకు నూర్పులు సందడించె
తే. నరుచి గన్పించె నొకచెల్వ మంకురించెఁ
దఱులు సమ మయ్యెఁ జిట్టుముల్ దఱుచు మీఱె
మొలచెఁ గోర్కులు నెమ్మేన నిలిచె నలఁత
నెలఁత కేర్పడెఁ దొలుచూలు నిలుచు నపుడు. 227

మ. కలుముల్ గన్నులఁ జిల్కుకల్కి మఱునిం గన్నట్టిచందాన నా
కలశాంభోనిధివీచికల్పతరువుం గన్నట్టియందంబునన్
గలకంఠీకులరత్న మంత శుభలగ్నం బందు నిం పొందఁగాఁ
గులదీపం బగునట్టిపట్టిఁ గనె దిక్కుల్ దెల్వి బెంపెక్కఁగన్. 228

క. ఋభువిభుసుతునకుఁ దనయుఁడు, ప్రభవించినసమయమున గుబాలునఁ గురిసెన్
నభమున సుమనోవర్షము, గుభగుభనినదములఁ గ్రందుకొనె దుందుభులున్. 229

గీ. అపుడు పార్థుఁడు శుభలేఖ ననుప ననుప, మానవిభవుండు శౌరి సమానమాన
వాధినాథులు కొలువంగ నరుగుదెంచె, నెలమితోడుత పాండవు లెదురుకొనఁగ.

క. హలి సాత్యకితోడఁ గుతూ,హలి యై తనసరస రాఁగ నంగనయును దా
నల బలరిపుసుతునగరికి, నలబ్బఱము చెలంగ నరిగె హరి గడు వేడ్కన్.

క. మన్యువివర్జితుఁడల శత,మన్యుతనూభవుఁడు లోకమాన్యవిపశ్చి
న్మాన్యులయనుమతి సుతు నభి, మన్యుం డని పేరు వెట్టె మది ముదమొదవన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. చెల్లెలికిని మఱఁదికి మే, నల్లునకు ననర్ఘ్యమణిమయాభరణంబుల్
వల్లభయుఁ దాను యదుకుల,వల్లభుఁ డపు డొసఁగె బంధువర్గము మెచ్చన్. 233

తే. కువలయాక్షులు పెనుచుమక్కువలవలన, నేటఁ బెరిగెడివాఁ డొక్కపూఁటఁ బెరిఁగి
మెల్ల మెల్లన శైశవ మెల్ల జాఱ, నందె యౌవన మారాజనందనుండు. 244

సీ. మనుమార్గమున భూమి మనుమార్గ మంతయు, స్థిరబుద్ధి యగుయుధిష్ఠిరుఁడు దెలుపఁ
బాటవనద్వైరిపాటనక్రమ మెల్ల, దరవర్జితుఁడు వృకోదరుఁడు దెలుప
రంగదుత్తుంగతురంగాధిరోహ ము,ద్దండబాహుఁడు నకులుండు దెలుప
సురభిరక్షణకీర్తి సురభిళదిఙ్మండ,లుం డగుసహదేవనుజన్ముండు దెలుప

తే. వివిధకోదండపాండిత్యవిలసనంబు, తాన తెలుపంగ నేర్చినతనయుఁ డెపుడు
సేవ సేయఁగ సంతతశ్రీ వెలుంగ, విజయుఁ డలరారె శాశ్వతవిజయుఁ డగుచు.

క. శ్రీరాజిలు రఘునాథో, ర్వీరమణుని పేర వెలయువిజయవిలాసం
బారోగ్యభాగ్యసంప,త్సారస్వతజయము లొసఁగు జదివినవినినన్. 236

ఆశ్వాసాంతము

ఉ. క్ష్వేళగళైణలాంఛన విజిత్వర శుభ్రియశోవిశాల ధా
రాళగళన్మదద్విరదరాజివిరాజిసభాంగణా ఘనా
వేలగరిష్ఠదానపదవీపరితోషితకాళగాలమీ
చోళకవిద్విజస్తుతవచోలగ చోలగమానభంజనా. 237

స్రగ్విణి. దుగ్ధవారాశివిద్యోతికీర్తీ సుధా, భుగ్ధురీణామనాగోభ్భగవర్తీ దయా
దృగ్ధుతాశేషధాత్రీ మరున్నిస్స్వతా, స్నిగ్ధసారస్వల స్సిద్ధసారస్వతా. 238

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధప్రసిద్ధసారస్వతసుధాసారజనితయ
శోలతాంకూర చేమకూరలక్ష్మణామాత్యతనయ వినయధురీణ సకలకళాప్రవీణాచ్యు
తేంద్రరఘునాథభూపాలదత్తహస్తముక్తాకటకవిరాజమాన వేంకటకవిరాజప్రణీ
తంబయినవిజయవిలాసం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

విజయవిలాసము

సంపూర్ణము.

---

'వావిళ' ప్రెస్, తండయార్పేట, చెన్నపురి.
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

JAGADGURU ...
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 7859

# [illegible] గ్రంథములు

---

| | ప్రతి 1–కి రూ. | అ. |
|---|---|---|
| **ఆంధ్ర భారతము:—** | | |
| ఆది, సభాపర్వములుగలసంపుటము ... | 2 | 0 |
| ఆరణ్యపర్వము ,, ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, .. | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ... | 2 | 0 |
| శాంతిపర్వము ,, ... | 2 | 0 |
| అనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానికస్వర్గారోహణపర్వములుగల సంపుటము ... | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము ... | 5 | 8 |
| యుద్ధషట్కము ,, ... | 3 | 8 |
| శాంతిసప్తకము ,, ... | 3 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాదిసూర్యనారాయణశాస్త్రిగారిది ... | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు ... | 0 | 2 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు ... | 3 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు. లక్ష్మణకవికృతము | 1 | 8 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము, సాధారణప్రతి | 1 | 8 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు ... | 3 | 8 |
| గోపీనాథరామాయణము, 2సంపుటములు శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యము, కవనము మిక్కిలిసొంపు,పీఠిక అతివిపులము ... | 5 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కగ ముద్రితము | 0 | 8 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 1 |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

